కొర్నేయ్ చుకోవ్‌స్కీ

# నొప్పిడాక్టరు

ఆధారం: హ్యూ లోఫ్టింగ్

చిత్రాలు: వి. దువీదోవ్

అనువాదం: ఆర్వియార్



"రాదుగ" ప్రచురణాలయం
మాస్కో

Rs 2 5 P 0 0



## ఒకటవ భాగం

# మర్కట రాజ్యానికి యాత్ర






# డాక్టరుగారూ ఆయన జంతువులూ

అనగా అనగా ఒక డాక్టరుగారు వుండేవారు. ఆయన జాలిగుండె మనిషి. ఆయన పేరు నొప్పిడాక్టరు. ఆయన రోగులు 'డాక్టరు బాబూ, నొప్పి' అంటూ ఆయన దగ్గరికి వచ్చేవాళ్లు. దాంతోటి ఆయనకి నొప్పిడాక్టరు అని పేరు వచ్చేసింది. ఆయనకి ఒక విషపుచ్చి అప్పగారు వుండేది. ఆవిడ పేరు వర్వారా.

డాక్టరుగారికి జంతువులంటే చెప్పలేనంత యిష్టం.

ఆయన గదిలో కుందేళ్లు వుండేవి. ఒక ఉడత అల్మారాలో వుండేది. బీరువాలో ఒక కాకి వుండేది. సోఫామీద ముళ్లపంది వుండేది. దాని ముళ్లు కూచి శలాకల్లా వుండేవి. తెల్లటి చుంచులు సొరుగులో వుండేవి.

తన దగ్గర వున్న వాటి అన్నిట్లోకీ డాక్టరుగారికి బాతు కికా అన్నా, కుక్క అవ్వా అన్నా, చిన్న పంది గుర్రుగుర్రు అన్నా, చిలక కరూడొ అన్నా, గుడ్లగూబ బుంబా అన్నా మహా యిష్టం.

డాక్టరుగారు తన గదిలో అన్ని జంతువుల్నీ వుంచుకోవడంవల్ల ఆయన విష పుచ్చి అప్పగారికి ఆయనంటే కోపంగా వుండేది.

''వాటిని తక్షణం తరిమెయ్యరా'' అని ఆవిడ అరుస్తూ వుండేది. ''గదు లన్నీ అవి కచాడీ చేసి తగలేస్తూ వుంటాయి! యీ పాడు వాటితోటి కలిసి నేను బతకలేను బాబూ'' అంటూ వుండేది.

''వర్వారా, నువ్వు అనేది తప్పు, అవి పాడు జంతువులు కావు. అవి నా గదిలో వుంటున్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది'' అనేవాడు డాక్టరుగారు.

రోగిష్టి గొల్లవాళ్లు, రోగిష్టి బెస్తవాళ్లు, వడ్రంగంవాళ్లు, రైతులు ఒకవేళాపాళా లేకుండా డాక్టరుగారి దగ్గరికి వచ్చేవాళ్లు. వాళ్లకి తలా ఒక మందూ ఆయన యిచ్చేవాడు. వాళ్లకి బాగయిపోయేది.

వూళ్లో యే కుర్రాడికేనా చేతికి గాయం అయినా, ముక్కు గీసుకుపోయినా హుటాహుటీన డాక్టరుగారి దగ్గరికి పరిగెత్తుకు వచ్చేవాడు. పట్టుమని పది నిము షాలు పట్టదు, వాడికి బాగయిపోయేది. అసలు యేం జరగనట్టే, వాడు చిలక కరూడొతోటి దొంగాట ఆడుకుంటూ వుండిపోయేవాడు. గుడ్లగూబ బుంబా వాడికి పళ్లూ ఫలాలూ యిచ్చేది.

ఒక రోజున ఓ గుర్రం డాక్టరుగారిని చూడ్డానికి వచ్చింది. అది చాలా విచారంగా వుంది. పూడిపోతున్న గొంతుకతోటి అది ''లామా, వనోయ్, ఫిఫి, కుకు'' అంది. డాక్టరుగారికి వెంటనే అర్థం అయింది. జంతువుల భాషలో ''నాకు కళ్లు పోటు పెడుతున్నాయి. కళ్లజోడు యివ్వండీ'' అని అర్థం.

డాక్టరుగారు యింతకు ముందే యెప్పుడో జంతువుల భాష నేర్చుకున్నారు. ఆయన ''కపూకీ, కవూనూకీ'' అన్నాడు గుర్రంతోటి. అంటే ''దయచేసి కూర్చోండి'' అని అర్థం.

అది కూర్చుంది. డాక్టరుగారు దాని కళ్లమీద కళ్లజోడు పెట్టాడు. దాని కళ్ల పోటు తగ్గింది.

గుర్రం ''చాకా'' అని తోక ఆడించి వీధిలోకి వెళ్లిపోయింది.

జంతువుల భాషలో ''చాకా'' అంటే ''థాంక్యూ'' అని అర్థం.

చూపు సరిగా ఆనని జంతువులన్నిటికి త్వరలోనే నొప్పిడాక్టరుగారు కళ్లజోళ్లు అమర్చాడు. గుర్రాలు కళ్లజోళ్లు పెట్టుకుని తేరిపార చూశాయి. ఆవులూ కళ్లజోళ్లు ధరించాయి. కుక్కలూ, పిల్లులూ కూడా కళ్లజోళ్లు పెట్టుకున్నాయి. ఆఖరికి ముసలి కాకులు కూడా కళ్లజోడు లేకుండా గూడు వదిలి యివతలికి వచ్చే సాహసం చెయ్యలేదు.

రోజురోజుకీ యింకా యెక్కువ జంతువులూ, పక్షులూ డాక్టరుగారి దగ్గరికి సాయం అడుగుతూ వచ్చేవి.

తాబేళ్లు, నక్కలు, మేకలు ఆయన దగ్గరికి వచ్చేవి. కొంగలూ, గద్దలూ ఆయన యింటికి యెగిరివచ్చేవి.

నొప్పిడాక్టరు వాటన్నింటికీ వైద్యం చేసేవాడు. కాని దేని దగ్గరనుంచీ డబ్బు పుచ్చుకునేవాడు కాదు. అయినా తాబేళ్ల దగ్గరా, గద్దల దగ్గరా యేముంటుంది గనక?

త్వరలోనే అడివిలోని చెట్లమీద ప్రకటనలు ప్రత్యక్షం అయాయి:

పశువుల కోసం, పిట్టల కోసం

ఆసుపత్రి ఒకటి వెలిసింది.

పదండి, పదండి వైద్యం కోసం
అక్కడికి!

పొరుగువాళ్ల పిల్లలు తాన్యా, వాన్యలు వీటిని రాసి అక్కడ పెట్టారు. ఒకసారి ఆ పిల్లలకి పొంగూ, ఎర్ర దద్దుర్లు అంటు జ్వరమూ వస్తే డాక్టరుగారు వైద్యం చేశాడు. వాళ్లకి డాక్టరుగారంటే మహా అభిమానం. ఆ పిల్లలు ఎగిరి గంతేసుకుంటూ ఆయనకి సాయం చేసేవాళ్లు.





## కోతి చిచీ

ఒక రోజు సాయంత్రం జంతువులన్నీ నిద్రపోయాక యెవరో డాక్టరుగారి కిటికీ తట్టారు.

''ఎవరది?'' అని ఆయన అడిగాడు.

''నేను'' అంటూ ఓ సన్నటి గొంతుకనుంచి సమాధానం వచ్చింది.

డాక్టరుగారు తలుపు తెరిచారు. చాలా బక్కపల్చగా, ఎడ్డిగా వున్న కోతి ఒకటి గదిలోకి వచ్చింది. డాక్టరుగారు దాన్ని సోఫామీద కూర్చోమని చెప్పి నొప్పి యేమిటని అడిగాడు.

''నా మెడ'' అని యేడవడం మొదలెట్టింది.

డాక్టరుగారికి కోతి మెడ చుట్టూతా ఒక తాడు కనిపించింది.

''నేను ఆ దుర్మార్గుడైన హార్మనీ వాయిద్యగాడినుంచి తప్పించుకు పారి పోయి వచ్చాను'' అని చెప్తూ కోతి మళ్లీ యేడవడం లంకించుకుంది. ''ఆ వాయిద్య గాడు నన్ను చితగ్గొట్టేవాడు, నన్ను చిత్రహింసలూ పెట్టి, తాడు కట్టి లాగే వాడు'' అని చెప్పింది.

డాక్టరుగారు కత్తెర తీసుకుని తాడు కత్తిరించాడు. అద్భుతమైన అంజనంతోటి కోతి మెడకి వైద్యం చేసేటప్పటికి చేత్తో తీసేసినట్టుగా తక్షణం నొప్పి పోయింది. అప్పుడు కోతిని నీళ్ల తొట్టిలో స్నానం చేయించి, తిండి పెట్టి, అన్నాడు:

''వానరం, మా యింట్లో వుండు. నువ్వు కష్టాల పాలపడ్డం నాకు కిట్టదు.''

కోతి చాలా సంతోషపడింది. కాని అది బల్ల దగ్గర కూర్చుని, డాక్టరు గారిచ్చిన వేరు శనక్కాయలు తింటూ వుంటే, ఆ దుష్ట వాయిద్యగాడు పరిగెత్తుకుంటూ గదిలోకి వచ్చాడు.

''నా కోతిని నాకిచ్చెయ్యండి'' అని అతను అరిచాడు. ''యిది నా కోతి'' అన్నాడు.

''వెనక్కివ్వడమా! లేదు, లేదు. దీన్ని యెన్నటికీ వెనక్కివ్వను. నువ్వు దీన్ని చిత్రహింసలు పెట్టడం ఒప్పుకోను'' అన్నాడు డాక్టరుగారు.

ఆ వాయిద్యగాడు కోపంతో పిచ్చెక్కిపోయాడు. డాక్టరుగారి మెడ అంది పుచ్చుకుందామని ప్రయత్నం చేశాడు.

కాని డాక్టరుగారు నిదానంగా అన్నాడు:

''తక్షణం అవతలికి పో. నువ్వు గనక గోలచేశావంటే మా కుక్క అవ్వాని పిలుస్తాను, కటక్కని కొరుకుతుంది నిన్ను.''

అవ్వా గదిలోకి పరిగెత్తుకుంటూ వచ్చి, బెదరగొట్టేటట్టు ''గుర్ – ర్ – ర్'' మంది.

''పారిపో లేకపోతే నిన్ను కరుస్తా'' అని దానికి జంతువుల భాషలో అర్థం.

ఆ వాయిద్యగాడికి బెదురుపుట్టి బ్రతుకు జీవుడా అని పారిపోయాడు. కోతి అచ్చంగా డాక్టరుగారి దగ్గర వుండిపోయింది. మిగిలిన జంతువులు తొందరలోనే అదంటే యిష్టపడి, దానికి ''చీచీ'' అని పేరు పెట్టాయి. అంటే జంతువుల భాషలో ''భలేటిది'' అని అర్థం.

తాన్యా, వాన్యలు ఆ కోతిని చూడగానే ఒక్క పెట్టున అరిచారు, ''యేం ముచ్చటైన కోతి! యెంత ముద్దొస్తోంది!'' అని.

అది తమ పాత స్నేహితుడైనట్టు దానితో ఆడుకోవడం మొదలెట్టారు. వాళ్ళు దానితో దొంగాట, దాగుడు మూతలాట ఆడుకున్నారు. అప్పుడు వాళ్ళు, ఆ కోతితో కలిసి, చెట్టాపట్టా లేసుకుని సముద్రం ఒడ్డుకి పరిగెత్తిపోయారు. అక్కడ ఆ కోతి వాళ్ళకి హుషారైన కోతి నాట్యం నేర్పింది. జంతువుల భాషలో దాన్ని ''త్కొల్లా'' అంటారు.





# నొప్పిడాక్టరుగారు పని చెయ్యడం

ప్రతి రోజు జంతువులు నొప్పిడాక్టరుగారి దగ్గరికి వైద్యానికి వచ్చేవి — నక్కలు, కుందేళ్లు, సీలు జంతువులు, గాడిదలు, చిన్న ఒంటెలు. కొన్నింటికి కడుపు నొప్పయితే, కొన్నింటికి పంటి నొప్పి. ప్రతి దానికీ డాక్టరుగారు మందు యిచ్చేవాడు. అన్ని జంతువులకీ నయమయేది.

ఒక రోజున తోకలేని చిన్న మేక ఆయన దగ్గరికి వచ్చింది. ఆయన దానికి కొత్త తోకని కుట్టాడు.

అప్పుడు యెక్కణ్నో దూరంనుంచి ఒక ఆడ ఎలుగుబంటి వచ్చింది. అది గుడ్లనీరు కుక్కుకుంది. మూలుగుతోంది, ముక్కుతోంది. ఓ పెద్ద పేడు దాని

పంజాలో దిగబడి వుంది. డాక్టరుగారు ఆ ముల్లు తీసేసి, గాయం కడిగేసి, తను వాడే దివ్య అంజనాన్ని రాశాడు.

వెంటనే నొప్పి తగ్గిపోయింది.

''థాంక్స్'' అని ఆడ ఎలుగుబంటి అరిచి యింటికి, తన గుహకి, వెళ్లి పోయింది. దాని పిల్లలు అక్కడ వున్నాయి.

ఆ తర్వాత ఒక కుందేలు వచ్చింది. కుక్కలు దాన్ని చిత్తుగా కొరికేశాయి.

తర్వాత ఒక రోగిష్టి పొట్టేలు వచ్చింది. దానికి చచ్చేటంత జలుబూ, దగ్గూనూ. తర్వాత రెండు కోడిపెట్టలు వచ్చాయి. అవి ఓ టర్కీ కోడిని తీసుకు వచ్చాయి. దానికి విషపు పుట్టగొడుగుల విషం బాగా యెక్కింది.

ప్రతి జంతువుకీ డాక్టరుగారు మందు యిచ్చాడు. వాటి అన్నిటికీ వెంటనే బాగయి పోయింది. ప్రతీ జంతువూ ''థాంక్స్'' అంది. అలా జంతువులన్నీ వెళ్లి పోయాక డాక్టరుగారికి గుమ్మం వెనకనుంచి అలికిడి వినిపించింది.

''లోపలికి రండి'' అని ఆయన కేకవేశాడు.

ఏడుపు మొహం పెట్టుకుని ఓ సీతాకోకచిలక ఆయన దగ్గరికి వచ్చింది.

''నా రెక్క కాలింది దీపానికి
సహాయంచెయ్యండి నొప్పిడాక్టరూ
కాలిన నా రెక్క ఒకటే నొప్పి!''

డాక్టరుగారికి సీతాకోకచిలకంటే జాలేసింది. దాన్ని అరచేతిలోకి తీసుకుని, కాలిన రెక్కని జాగ్రత్తగా చూశాడు. అప్పుడు చిరునవ్వు నవ్వి అన్నాడు:

''ఏంటది బెంగపడకు
సీతాకోకచిలకా
యింకో రెక్క కుడతాను

నీలం రంగు పట్టుది
వాలిపడుకో పక్కకి.
కొత్తది
మంచిది
మరో రెక్క!''

అలా అని డాక్టరుగారు పక్క గదిలోకి వెళ్ళాడు. చిన్న పీలికల పోగుని తీసుకువచ్చాడు. అందులో వెల్వెట్, కాంబ్రిక్, శాటిన్, పట్టు పీలికలు అన్ని రకాల రంగులవీ వున్నాయి. నీలంవి, ఆకుపచ్చవి, నల్లటివి వున్నాయి. నప్పే పీలిక కోసం డాక్టరుగారు చాలా సేపు వెదికి, ఆఖరికి ఎర్ర చుక్కలతోటి మెరిసిపోయే నీలం ముక్కని తీశాడు. కత్తెర తీసుకుని, మంచి ముక్కని రెక్కలా కత్తిరించి సీతాకోకచిలకకి కుట్టాడు.

కిలకిలా నవ్వింది సీతాకోకచిలక
తుర్రునపోయింది పచ్చికమీదకి
ఆడింది, పాడింది బర్చ్ చెట్లకింద
మిడలతో, తూనీగలతో.
హుషారుగా వుండే నొప్పిడాక్టరు
అరిచాడు దాన్ని చూసి కిటికీనుంచి
''ఆడుకో, పాడుకో హుషారుగా
కాని మాత్రం జాగ్రత్త నిప్పు చూసుకో!''

ఆ రకంగా సాయంత్రం బాగా పొద్దుపోయే దాకా డాక్టరుగారు రోగులతో తీరికలేకుండా గడిపాడు.

ఆ తర్వాత సోఫామీద వాలి నిద్రపోయాడు. నిద్రలో ఆయనకి తెల్ల ఎలుగు బంట్లు, లేళ్లు, వాల్రస్‌లు కనిపించాయి.

వున్నట్టుండి యెవళ్లో తలుపు తట్టారు.





# మొసలి

డాక్టరుగారు వుంటున్న వూళ్లో ఓ సర్కస్ వుంది. అందులో ఒక పెద్ద మొసలి వుంది. దాన్ని ఒక సారి చూడ్డం కోసమన్చెప్పి జనం డబ్బు యిచ్చేవాళ్లు.

ఆ మొసలికి ఒకటే పళ్ల నొప్పి పుట్టి డాక్టరుగారి దగ్గరికి వైద్యం కోసం వచ్చింది. డాక్టరుగారు దానికి దివ్యాంజనం యిచ్చాడు. అంతే ఎక్కడి పంటి నొప్పి అక్కడ మాయం అయిపోయింది.

''యిక్కడ భలే బాగుందే'' అంది మొసలి చుట్టూతా చూసి పెదాలు చప్పరిస్తూ. ''మీ దగ్గర బోలెడు కుందేళ్లు, పిట్టలు, చుంచులు వున్నాయి. అవన్నీ

సియ్యి పట్టి భలే రుచిగా వుంటాయి. నన్ను యెప్పటికీ యిక్కడ వుండి పోనివ్వండి. సర్కస్ యజమాని దగ్గరికి నాకు తిరిగివెళ్లాలని లేదు. నాకు సరిగా తిండిపెట్టడు, చితగ్గొడతాడు, నన్ను సరిగా చూడడు'' అంది మొసలి.

''అలాగే'' అన్నాడాయన. ''నువ్వు గనక ఓ పిచికనో కుందేల్నో కబళించావో జాగ్రత్త నిన్ను తన్ని తగలేస్తాను'' అని హెచ్చరించాడు.

''సరే'' అంది మొసలి, నిట్టూరుస్తూ. ''నేను కుందేళ్లని గాని, ఉడతల్ని గాని, పిట్టల్ని గాని ముట్టుకుంటే ఒట్టు'' అని వాగ్దానం చేసింది.

మొసలి అప్పట్నుంచీ డాక్టరుగారి యింట్లోనే వుండిపోయింది.

అది భలేటిది. ఒకళ్ల జోలికీ సొంటికీ పోకుండా, సోఫాకింద పడుకుని వుండేది. ఉష్ణ ఆఫ్రికా ఖండంలో వున్న తన అన్నదమ్ముల గురించీ, అక్కచెల్లెళ్ల గురించీ ఆలోచించుకుంటూ వుండేది.

డాక్టరుగారికి మొసలి అంటే అభిమానం పెరిగి, ఎక్కువగా దానితో కబుర్లు చెప్పేవాడు. కాని విషపుచ్చి వర్వారాకి మొసలంటే మంట. దాన్ని తరిమెయ్యమని డాక్టరుగారిని పోరేది.

''దీన్ని చూడాలంటే అసహ్యం నాకు'' అని అరిచేది. ''ఎంత వెలపరంగా వుంటుందో పారల్లా పళ్లూ అదీ! యిది దేన్ని ముట్టుకుంటే అదే తగులడి పోతుంది! నిన్న మటుకు నిన్న నా గదిలో కిటికీ రెక్కమీద వున్న నా ఆకుపచ్చ గౌనుని చింపేసింది'' అని చెప్పింది.

''మంచి పని చేసింది. నీ బట్టల్ని నువ్వు లోపల దాచుకోవాలి గాని కిటికీ రెక్కలమీద విసిరి పారెయ్యకూడదు'' అన్నాడు డాక్టరుగారు.

''అవును మరి యీ శనిగొట్టు యిక్కడ వుందిగా'' అంది వర్వారా. ''మర్యాదస్థులు నీ యింటికి రావాలంటే జంకుతారు. బీదాబిక్కీ మాత్రం వస్తారు నువ్వు

వూరికే వైద్యం చేస్తావని. యిప్పుడు చూడు మనం యెంత బీద వాళ్లమై పోయామో. రొట్టె కొనుక్కోడానికి కూడా డబ్బు లేదు!'' అంది.

''నాకు డబ్బక్కర్లేదు'' అన్నాడు నొప్పిడాక్టరు. ''డబ్బు లేకపోయినా నిక్షేపంలా వున్నాను. మన జంతువులు నీకూ, నాకూ తిండి సంపాదించి పెడతాయి'' అన్నాడు.





# డాక్టరుగారికి స్నేహితుల సహాయం

వర్వారా అన్న ముక్క నిజమే. డాక్టరుగారికి తిండి లేకపోయింది. డబ్బు లేకపోవడం వల్ల మూడు రోజులు ఆకలితో మాడాల్సి వచ్చింది.

డాక్టరుగారికి తిండానికి యేమీ లేదని ఆయన దగ్గర వున్న జంతువులు చూసి ఆయనకి ఆహారం సంపాదించ మొదలెట్టాయి. గుడ్లగూబ బుంబా, చిన్న పంది గ్రురుగ్రురు పెరట్లో చిన్న కాయగూరల తోట తయారు చేశాయి. పంది వాళ్ళ తవ్వితే బుంబా బంగాళా దుంపలు నాటింది. ఆవు పొద్దున్నా సాయంత్రం రోజుకి రెండు సార్లు పాలిచ్చేది. కోడిపెట్ట గుడ్లు పెట్టేది.

జంతువులన్నీ డాక్టరుగారిని గురించి శ్రద్ధపట్టాయి: కుక్క అవ్వా నేల

వూడ్చేది. పిల్లలు తాన్యా, వాన్యలతో కలిసి కోతి చిచీ నూతినుంచి నీళ్లు తెచ్చేది.

డాక్టరుగారికి తృప్తి కలిగింది.

''మా చిన్న యిల్లు యిప్పుడున్నంత శుభ్రంగా యెప్పుడూ లేదు. పిల్లలూ, జంతువులూ! మీరు చేసిన పని మర్చిపోలేన్రా'' అన్నాడాయన.

జవాబుగా పిల్లలు చిరునవ్వు నవ్వారు. జంతువులన్నీ యేక కంఠంతో అన్నాయి:

''కరాబూకి, మరాబూకి, బూ!'' అంటే ''మీకు సాయం చెయ్యకుండా యెలా వుంటాం? మీరు మా ఆప్త మిత్రులు'' అని జంతువుల భాషలో అర్థం.

కుక్క అవ్వా డాక్టరుగారి చెక్కిలి నాకి, అంది:

''అబుజో, మబుజో, బాక్'' అంటే జంతువుల భాషలో,

''మేము మిమ్మల్ని యెన్నడూ వదిలిపెట్టం, మీ నమ్మిన నేస్తాలుగా సర్వదా వుండిపోతాం'' అని అర్థం.





# స్వాలో పక్షి

ఒక రోజు సాయంత్రం గుడ్లగూబ బుంబా అంది: ''హుష్, ఆగండి. ఎవరో తలుపు గీరుతున్నారు. చుంచేమో.''

జంతువులూ, డాక్టరుగారూ చెవులు రిక్కించి విన్నా కాని యేం చెవిన పళ్లేదు.

''ఎవరూ లేరు. నువ్వు చప్పుడు అనుకొని భ్రమపడ్డావేమో'' అన్నాడు డాక్టరుగారు.

''వుహు, భ్రమపళ్లేదు. ఎవరో గీరుతున్నట్టు స్పష్టంగా నాకు వినిపిస్తూ వుంటేనే. అది చుంచేనా అయివుండాలి, పిట్టేనా అయివుండాలి. నిజం, నన్ను

నమ్మండి. గుడ్లగూబలకి మనుషులకంటే వినికిడి యెక్కువ వుంటుంది'' అని జవాబు చెప్పింది గుడ్లగూబ.

బుంబా అన్న మాట నిజమే.

కోతి తలుపు తీసింది. గుమ్మంలో స్వాలో పిట్ట కూర్చుని వుంది.

శీతాకాలంలో స్వాలో పిట్ట? చిత్రంగా వుందే! స్వాలో పిట్టకి చలి పడదు. ఆకురాలు కాలం మొదలవగానే ఉష్ణ ఆఫ్రికా ఖండానికి ఎగిరిపోతుంది. పాపం స్వాలో పిట్ట, మంచులో కూర్చుని, వణికి పోతూ చలికి కొరడు గట్టి పోతోంది.

''స్వాలో!'' అని డాక్టరుగారు అరిచాడు. ''గదిలోకి రా. నెగడు దగ్గర చలికాగు'' అన్నాడు.

మొదట్లో గదిలోకి రావడానికి స్వాలో పిట్ట భయపడింది. మొసల్ని చూసి అది తనని కబళిస్తుందేమోనని భయపడింది. కాని మొసలి చాలా మంచిదని కోతి చిచీ దానికి చెప్పింది. అప్పుడు స్వాలో గదిలోకి యెగిరివెళ్ళింది. చుట్టూతా చూసి అంది:

''చిరుతో, కిసాఫా, మాక్?''

అంటే జంతువుల భాషలో ''యిది నొప్పిడాక్టరుగారి యిల్లేనా చెప్పండి'' అని అర్థం.

''నేనే నొప్పిడాక్టరు''ని అన్నాడు డాక్టరుగారు.

''నాదో ముఖ్యమైన విన్నపం వుందండి'' అంది స్వాలో. ''మీరు తక్షణం ఆఫ్రికా రావాలి. మిమ్మల్ని అక్కడికి రమ్మని పిలవడం కోసమే నేను ప్రత్యేకం యిక్కడికి ఎగిరివచ్చాను. ఆఫ్రికాలో వుండే కోతులకి చాలా జబ్బుగా వుంది.''



''ఏమిటి వాటి జబ్బు?'' అని డాక్టరుగారు అడిగాడు.

''వాటికి కడుపు నొప్పి. నేలమీద పడి యేడుస్తున్నాయి. వాటిని రక్షించగల మనిషి ఒక్కరే — మీరు. మందులు తీసుకోండి, యే మాత్రం ఆలస్యం చెయ్యకుండా ఆఫ్రికాకి పోదాం నడవండి. మీరు ఆఫ్రికాకి రాకపోతే కోతులన్నీ చచ్చిపోతాయి.

''ఆఁ!'' అన్నాడు డాక్టరుగారు. ''ఆఫ్రికాకి సంతోషంగా వస్తాను. నాకు కోతులంటే యిష్టం. వాటికి జబ్బుగా వుందంటే విచారంగా వుంది. కాని నాకు ఓడ లేదు. ఆఫ్రికాకి వెళ్లాలంటే ఓడ కావాలి కదా.''

''అయ్యో పాపం కోతులూ. డాక్టరుగారు ఆఫ్రికా వెళ్లకపోతే అవి చచ్చి పోతాయి. యేమంటే ఆయనొక్కడే వాటికి నయంచేసేవాడు'' అంది మొసలి.

మొసలి యెంత పెద్ద కన్నీరు కార్చడం మొదలుపెట్టిందంటే నేలమీద రెండు సెలయేళ్లు యేర్పడి ప్రవహించడం మొదలెట్టాయి.

వున్నట్టుండి నొప్పిడాక్టరుగారు అరిచాడు:

''సరే యేమైనా గానీ, నేను ఆఫ్రికా వెళ్లి, పాపం ఆ కోతుల్ని బాగు చేస్తాను. యిప్పుడే గుర్తు వచ్చింది. మా మంచి మిత్రుడు రాబిన్‌సన్‌కి భేషైన ఓడ వుంది. అతను నావికుడు. అతనికి జ్వరం వచ్చినప్పుడు నేను తగ్గించాను.'' డాక్టరుగారు టోపీ తీసుకుని నావికుడు రాబిన్‌సన్ దగ్గరికి వెళ్లాడు.

''ఏమోయ్, రాబిన్‌సన్ నావికా. నాకు నీ ఓడ యిచ్చి పుణ్యం కట్టుకో. నేను ఆఫ్రికా వెళ్లాలి. సహారా యెడారికి దగ్గర అద్భుతమైన మర్కట దేశం వుంది'' అన్నాడు డాక్టరుగారు.

''అలాగే'' అన్నాడు నావికుడు రాబిన్‌సన్. ''నీకు ఓడ యివ్వడానికేం, సంతోషంగా యిస్తాను. నువ్వు నా ప్రాణం కాపాడావు. నువ్వు యే సాయం కావాలన్నా సంతోషంగా చేస్తాను. కాని దయచేసి నా ఓడ నాకు తిరిగి యిచ్చెయ్యి. యిది తప్పితే నాకు మరి యింకో ఓడ లేదు'' అన్నాడు.

''తప్పకుండానూ. తిరిగి యిచ్చేస్తాను. వూరికే ఆఫ్రికా వెళ్లి తిరిగివచ్చేస్తాను'' అన్నాడు డాక్టరుగారు.

''సరే. నా ఓడ తీసుకెళ్లు. తెరచాప మడతలు జాగ్రత్త బాబూ.''

''మరేం బెంగపడకు. నే చూసుకుంటాగా'' అన్నాడు డాక్టరుగారు. రాబిన్‌సన్‌కి కృతజ్ఞత చెప్పి, యింటికి వెళ్లిపోయారు.

''జంతువులూ, వూఁ, తయారుకండి'' అంటూ ఆయన గుమ్మంలోనుంచే అరిచాడు. ''మనం రేపు ఆఫ్రికా వెడుతున్నాం.''

జంతువులు సంతోషపడిపోయాయి. సంబరంతో డాన్సు కూడా చేశాయి. చపట్లు చరిచాయి. వాటన్నిటిలోకీ బాగా ఆనందంగా వుంది కోతి చిచీయే.

''నే వెడుతున్నా, వెడుతున్నా ఆఫ్రికాకి,
నా ప్రియమైన గడ్డకి
ఆఫ్రికా, ఆఫ్రికా
నా ప్రియమైన మాతృదేశమా!''

''నేను జంతువులన్నింటినీ ఆఫ్రికా తీసుకెళ్లను'' అన్నాడు నొప్పిడాక్టరు. ''ముళ్లపందులూ, గబ్బిలాలూ, కుందేళ్లూ యిక్కడనే మనింట్లో వుండిపోతాయి. గుర్రం కూడా వుండిపోతుంది. నాతో కూడా మొసల్నీ, కోతి చిచీనీ, చిలక కరూడొనీ తీసికెడతాను. యేమంటే అవి అసలు ఆఫ్రికావే. వాటి అక్కచెల్లెళ్లూ, అన్నదమ్ముళ్లూ, తల్లిదండ్రులూ వుండడం అక్కడనే. వీటితో బాటుగా నేను అవ్వానీ, కికానీ, బుంబానీ, చిన్న పంది గుర్రుగుర్రునీ తీసుకెడతాను'' అన్నాడు.

''మరి మా సంగతో'' అన్నారు తాన్యా, వాన్యలు. ''మీరు లేకుండా మేం యిక్కడ వుండమా?'' అనడిగారు.

''వూఁ'' అని డాక్టరుగారు ఖండితంగా చెప్పి, వాళ్లతో కరచాలనం చేశాడు. ''సెలవ్, మిత్రులారా! మీరిక్కడే వుండి కాయగూరల తోటనీ, పువ్వుల తోటనీ జాగ్రత్తగా చూస్తూ వుండండి. మేం త్వరలోనే తిరిగివచ్చేస్తాం. ఆఫ్రికానుంచి మీకు అద్భుతమైన బహుమతీ తెస్తాం.''

తాన్యా, వాన్యలు దిగాలు పడిపోయారు. కొంచెం సేపు ఆలోచించుకున్నాక అన్నారు:

''యేం లాభం లేదు. మనం ప్రయాణం చెయ్యడానికి యింకా చాలా చిన్న వాళ్లం. క్షేమంగా వెళ్లిరండి! మేం పెద్దయాక మీతో ప్రయాణం చేస్తాం.''

''తప్పకుండా. మీరు యింకొంచెం పెద్ద వాళ్లవాలంతే'' అన్నాడు డాక్టరుగారు.





## ఆఫ్రికాకి!

జంతువులు గబగబా డాక్టరుగారి సామాన్లు సద్దేశాయి. అన్నీ కలిసి ప్రయాణం అయివెళ్లిపోయాయి. కుందేళ్లు, చెవుల పిల్లులు, ముళ్లపందులు, గబ్బిలాలు మాత్రం యింటి దగ్గర వుండిపోయాయి.

సముద్రం ఒడ్డుకి రాగానే ఆ జంతువులకి అద్భుతమైన ఓడ కనిపించింది. నావికుడు రాబిన్‌సన్ దాని పక్కన నుంచున్నాడు. చిన్న పంది గుర్రుగుర్రు, కోతి చిచీ సహాయం చేస్తూ వుంటే వాన్య, తాన్యాలు మందుల పెట్టెల్ని ఎక్కించడానికి డాక్టరుగారికి సాయపడ్డారు.

జంతువులన్నీ పైకి యెక్కాయి. యిక బయల్దేరడానికి సిద్ధంగా వున్నాయి. అప్పుడు డాక్టరుగారు గట్టిగా అరిచాడు:

''ఆగండి! ఆగండి!'' అని.

''యేమైంది?'' అని మొసలి అడిగింది.

''ఆగండి బాబూ'' అన్నాడు డాక్టరుగారు. ''నాకు ఆఫ్రికా యెక్కడుందో తెలీదు. అక్కడికి దారి యెలాగో యెవర్నైనా అడిగి తెలుసుకోవాలి.''

మొసలి నవ్వింది.

''ఎక్కడికీ వెళ్లద్దు, యేమీ బెంగపడకండి. స్వాలో దారి చూపిస్తుంది. తను ఆఫ్రికా యెన్నో సార్లు వెళ్లింది. ప్రతి యేడూ ఆకురాలు కాలంలో స్వాలో పక్షులు ఆఫ్రికాకి పోతాయి.''

''యేం బెంగపెట్టుకోకండి'' అంది స్వాలో. ''అక్కడికి నేను తీసికెడతాగా మిమ్మల్ని'' అంది.

అది ఓడకు ముందు ఎగురుతూ పోయింది నొప్పిడాక్టరుకి దారి చూపిస్తూ.

ఆ పక్షి ఆఫ్రికాకి యెగురుతూ పోతోంది. దాని వెనకాలే నొప్పిడాక్టరుగారు ఓడని నడుపుతున్నాడు.

రాత్రి చీకటిగా వుంది. స్వాలో కనిపించడం లేదు. అప్పుడది చిన్న లాంతరు వెలిగించి ముక్కుతో పట్టుకుంది. ఆ రకంగా డాక్టరుగారికి రాత్రిళ్లు పడవ నడిపే దారి కనిపించింది.

ఓ రోజున ఒక కొంగ ఓడ కేసి యెగురుతూ రావడం కనిపించింది.

''ప్రఖ్యాత నొప్పిడాక్టరుగారు ఓడలో వున్నారా?'' అని కొంగ అడిగింది.

''ఆఁ'' అని మొసలి జవాబిచ్చింది. ''ప్రఖ్యాత నొప్పిడాక్టరుగారు ఓడలో వున్నారు.''

''దయచేసి డాక్టరుగారిని గబగబా రమ్మనరూ, కోతులకి మరీ అధ్వాన్నం అయిపోయింది. అవి డాక్టరుగారి కోసం ఆదుర్దాగా చూస్తున్నాయి'' అంది.

''యేం దిగులు పడద్దు. మేం చాలా వేగంగా నడుపుతున్నాం. కోతులు యెక్కువ కాలం నిరీక్షించక్కర్లేదు'' అంది మొసలి.

ఆ మాట విన్నాక కొంగ కొంచెం కుదుట పడింది. నొప్పిడాక్టరుగారు మరీ దూరంలో లేరని చెప్పడానికి కోతుల దగ్గరికి యెగిరివెళ్లిపోయింది.

ఓడ వేగంగా నడుస్తోంది. మొసలి పైన వుంది. వున్నట్టుండి డాల్ఫిన్‌లు ఓడ దగ్గరికి యీదుకుంటూ రావడం చూసింది.

''బాబ్బాబు, ప్రఖ్యాత నొప్పిడాక్టరుగారు ఓడలో వున్నారేమో చెప్తారా'' అని అడిగాయి.

''వూఁ, వున్నారు. ప్రఖ్యాత నొప్పిడాక్టరుగారు ఓడలో వున్నారు'' అని మొసలి బదులు చెప్పింది.

''కోతులకి యింకా యింకా అధ్వాన్నం అయిపోతోంది. డాక్టరుగారిని యింకా వేగంగా రమ్మని చెప్తారా?''

''యేం దిగులు పడకండి. మేం మంచి స్పీడుగా వస్తున్నాం. కోతులు యెక్కువ సేపు నిరీక్షించక్కర్లేదు'' అంది మొసలి.

ఉదయం డాక్టరుగారు మొసలితో అన్నాడు:

''ఓడ ముందు యేమిటది? అది పెద్ద భూభాగం అనుకుంటాను. యిది ఆఫ్రికా యేమో.''

''అవును, యిదే ఆఫ్రికా'' అని అరిచింది మొసలి. ''ఆఫ్రికా! ఆఫ్రికా! కొంచెం సేపట్లో ఆఫ్రికాలో అడుగుపెడుతున్నాం! అదుగో ఉష్ట్రపక్షి కనిపిస్తోంది. ఖడ్గమృగం అదుగో. ఒంటెలు, ఏనుగులు!''

ఆఫ్రికా! ఆఫ్రికా!
నా ప్రియమైన ఖండమా!
ఆఫ్రికా! ఆఫ్రికా!
నా మాతృభూమీ!






# తుఫాను

కాని ఆ సమయంలో తుఫాన్ విరుచుకుపడింది. వాన! గాలి! మెరుపులు! ఉరుములు! అలలు ఉవ్వెత్తున లేచాయి, వాటిని చూస్తేనే యెవళ్లైనా భీతాంగం యెత్తిపోయేవాళ్లు.

వున్నట్టుంది యేదో రావణాగోల — ట్రాక్-ట్రా-ట్రాక్ — ఓడ ఒరిగింది.

''ఏమైంది? ఏమైంది?'' అని డాక్టరుగారు అడిగాడు.

''ఓడ బద్దలైపోతుంది'' అని చిలక అరిచింది. ''మన ఓడ బండరాతికి ఢీకొట్టింది, ఫెళఫెళా విరిగిపోతోంది. మనం మునిగి పోతున్నాం. ఎవళ్లకి వాళ్లు బయటపడండి.''



''కాని నాకు యీత రాదే!'' అంది చిచీ.

''నాకూ రాదు'' అంది గుర్రుగుర్రు.



అవి రెండూ భోరున యేడ్చాయి. అదృష్టవశాత్తూ మొసలి వాటిని తన వెడల్పాటి వీపుమీద యెక్కించుకుని ఒడ్డుకు సరాసరి యీదుకుంటూ పోయింది.

అమ్మయ్య బతికాం! అంతా సురక్షితంగా వుండడం, అంతా ఆఫ్రికా చేరుకోవడం జరిగింది. కాని ఓడ మాత్రం పోయింది. ఓ పెద్ద అల లేచి దాన్ని ముక్కలు ముక్కలు చేసేసింది.

మరి యింటికి తిరిగివెళ్లడం యెలాగ? యిక వేరే ఓడ లేదు. నావికుడు రాబిన్‌సన్‌కి యేం చెప్పాలి?

చీకటి పడుతోంది. డాక్టరుగారు బాగా అలిసిపోయారు. ఆయన జంతువు లూనూ. నిద్ర ముంచుకొచ్చేస్తోంది. అవి మొత్తం తడిసిపోయాయి.

అయినా డాక్టరుగారు పడుకోవాలని అనుకోలేదు.

''పదండి, పదండి! మనం వేగిరపడాలి! కోతుల్ని కాపాడాలి! పాపం వాటన్నటికీ జబ్బుగా వుంది. వాటిని బాగు చేస్తానని నా కోసం ఆతృతగా చూస్తున్నాయి!''






# డాక్టరుగారు చిక్కుల్లో పడడం

గుడ్లగూబ బుంబా డాక్టరుగారి దగ్గరికి ఎగిరివచ్చి బెదురు గొంతుకతో అంది:

''హుష్, వుండండి. ఎవరో వస్తున్నారు. ఎవళ్లవో అడుగుల చప్పుడు వినిపిస్తోంది.''

మొత్తం అన్నీ ఆగిపోయి, విన్నాయి.

చింపిరి జుట్టు రేగిపోయి, పొడుగాటి నెరిసిన గడ్డం వున్న ముసలాయన ఒకడు అడివిలోంచి యివతలికి వచ్చి, అరిచాడు:

''యిక్కడేం చేస్తున్నారు? ఎవరు మీరు? యిక్కడికెందు కొచ్చారు?''



''నన్ను నొప్పిడాక్టరు అంటారు. జబ్బుగా వున్న కోతుల్ని బాగు చెయ్యడం కోసం ఆఫ్రికా వచ్చాను'' అని చెప్పాడు డాక్టరుగారు.

''హా, హ్హా, హ్హా!'' అంటూ నవ్వాడు చింపిరి జుట్టు మనిషి. '''జబ్బుగా వున్న కోతుల్ని బాగు చెయ్యడం కోసం!' యింతకీ మీరు యిప్పుడెక్కడున్నారో తెలుసా?''

''వుహుఁ, ఎక్కడున్నాం?'' అని అడిగాడు డాక్టరుగారు.

''గజదొంగ బార్మలేయ్ దగ్గరికి వచ్చారు మీరు!''

''బార్మలేయ్ దగ్గరికా!'' అని అరిచాడు డాక్టరుగారు. ''అయ్యో, యేం గతి పట్టింది! భూమ్మీద బార్మలేయ్ అంత దుష్టుడు లేడు. కాని గజదొంగకి లొంగం, చావనేనా చస్తాం గాని! మనం రోగిష్టి కోతుల దగ్గరికి పరిగెత్తి పోదాం పదండి!

అవి ఏడుస్తున్నాయ్. మన కోసం చూస్తున్నాయ్. వాటిని బాగు చెయ్యాలి మనం!''

''వీల్లేదు!'' అని చింపిరి జుట్టు మనిషి అరిచాడు. యింకా బిగ్గరగా నవ్వాడు. ''మీరీ చోటు వదిలిపెట్టి యెన్నటికీ పోలేరు. తన బందీలందర్నీ బార్మలేయ్ యెప్పుడూ చంపేస్తాడు.''





''పదండి పరిగెత్తిపోదాం!'' అని అరిచాడు డాక్టరుగారు. ''పరిగెత్తిపోదాం! మనల్ని మనం రక్షించుకోగలం. మనల్ని మనం రక్షించుకుందాం.''

కాని బార్మలేయ్ తనే వాళ్ల ముందు ప్రత్యక్షం అయి, కత్తి ఝుళిపిస్తూ అరిచాడు:

''హేయ్! నా అనుంగు సేవకుల్లారా! యీ బదుద్దాయి డాక్టరునీ, యీాయన

గారి బడుద్ధాయి జంతువుల్నీ పట్టుకుని, కటకటాల వెనక కొట్లో పడెయ్యండి. రేపు మొత్తం యీ ఆయన్నీ వాటినీ సఫా చేసేస్తా.''

బార్మలేయ్ దుష్ట సేవకులు పరిగెత్తుకుంటూ వచ్చి డాక్టరుగారినీ మొసల్నీ అంది పుచ్చుకున్నారు. అన్ని జంతువుల్నీ అంది పుచ్చుకున్నారు. ఆయన్నీ, జంతువుల్నీ మొత్తం జైలుకి తీసికెళ్ళిపోయారు. డాక్టరుగారు ధైర్యంగా పోరాడేడు. జంతువులు సేవకుల్ని కరిచాయి. గీరాయి. తాము వదిలించుకుని బయటపడాలని ప్రయత్నించాయి. కానీ శత్రువుల సంఖ్య తమకంటే యెక్కువ, పైగా వాళ్ళు బాగా బలంగా వున్నారు. వాళ్ళు తాము పట్టుకున్న బందీలని జైల్లో పడేశారు. చింపిరి జుట్టు ముసలాయన వాటిని అక్కడ తాళం పెట్టేశాడు.

అతను తాళం చెవిని బార్మలేయ్‌కి యిచ్చాడు. బార్మలేయ్ దాన్ని తీసుకుని తలగడకింద పెట్టుకున్నాడు.

''మనకేం ఖర్మ పట్టింది! యీ జైలునుంచి మనం యిక యెన్నటికీ బయట పడలేం. దీనికి గట్టి గోడలూ, యినప తలుపులూనూ! యిక మనకి బయట ప్రపంచం, పువ్వులు, చెట్లు యెన్నటికీ కనిపించవు. అయ్యో దేవుడా!'' అంది చిచీ.

చిన్న పంది ''గుర్రు గుర్రు'' మనడం మొదలెట్టింది. కుక్క కుయ్యో మనడం మొదలెట్టింది. మొసలి యెంత పెద్ద కన్నీళ్ళు కార్చడం మొదలెట్టిందంటే నేలమీద అంతా మడుగు కట్టేసింది.






## చిలక కరూడో చేసిన సాహసకృత్యం

కాని డాక్టరుగారు జంతువులతోటి అన్నాడు:

"నేస్తాల్లారా! దిగులు పడకూడదు! యీ దరిద్రపు గొట్టు జైలునుంచి మనం బయటపడాలి, అక్కడ రోగిష్టి కోతులు మన కోసం చూస్తున్నాయి! ఏడవద్దు! మనం యెలా బయటపడతానూ అని ఆలోచించండి."

"లేదు డాక్టరు బాబూ" అంది మొసలి. యింకా గట్టిగా యేడవడం మొదలెట్టింది. "యిక్కడనుంచి మనం బయటపడలేం. మన పని అయిపోయింది! యీ జైలు తలుపులు గట్టి యినుముతో చేసినవి. మనం వాటిని యెలా చితగ్గొట్ట గలం? రెప్పొద్దున్నే తెల్లవారుతూనే బార్మలేయ్ వచ్చి, మనల్నందర్నీ చంపేస్తాడు."

బాతు కికా కూనిరాగం తియ్యడం మొదలెట్టింది. చిచీ గాఢంగా నిట్టూర్చింది. కాని డాక్టరుగారు గబుక్కున లేచి, హుషారుగా అరిచాడు:

"ఏమైనా మనం జైలునుంచి బయటపడతాం!"

ఆయన చిలక కరూడొని పిలిచి యేదో దాని చెవిలో గొణిగాడు, ఎవరికీ వినిపించనంత సన్నగా. చిలక నవ్వింది. తల ఆడించి "సరే" అంది.

తర్వాత అది యినప వూచల దగ్గరికి వెళ్లి, వాటిగుండా బయటికి దూరి, సరాసరి బార్మలేయ్ దగ్గరికి వెళ్లింది.

బార్మలేయ్ తన మంచంమీద గుర్రుకొట్టి నిద్రపోతున్నాడు. అతని తలగడకింద వుంది – ఆ జైలు యినప తలుపులకి వేసిన తాళం చెవి.

చిలక చడీచప్పుడూ కాకుండా బార్మలేయ్ దగ్గరికి వెళ్లి, అతని తలగడ కిందనుంచి తాళం చెవిని కొట్టేసింది. ఆ గజదొంగ గనక లేచి వుంటేనా అంత ధైర్యం వున్న ఆ పక్షిని ఖాయంగా చంపేసి వుండేవాడు.

కాని అదృష్టవశాత్తూ అతను గాఢ నిద్రలో వున్నాడు.

సాహసంగల కరూడొ తాళం చెవిని తీసుకుని, తన శక్తి కొద్దీ జైలుకి ఎగిరివచ్చింది.

ఎంత బరువుంది ఆ తాళం చెవి! కరూడొ వెనక్కి తిరిగి ఎగురుతూ వచ్చేటప్పుడు దాదాపు దాన్ని కింద పడేసినంత పని చేసింది. కాని యెలాగైతేనేం అది జైలు దగ్గరికి యెగురుకుంటూ వచ్చి, కిటికీ వూచలగుండా దూరి నొప్పిడాక్టరు దగ్గరికి సరాసరి వెళ్లింది. జైలు తాళం తీసుకొచ్చినందుకు దాన్ని చూసి డాక్టరుగారికి చాలా సంతోషం కలిగింది.

"భేష్! మనం బయటపడ్డాం!" అని ఆయన అరిచాడు. బార్మలేయ్ నిద్ర లేవకముందే తొందరగా వెళ్దాం.



డాక్టరుగారు తాళం తీసి, తలుపు తెరిచాడు. జంతువులు వెనక్కాల వస్తూ వుంటే బయిటికి పరిగెత్తాడు. సెభాష్! మొత్తం అంతా బతికి బట్ట కట్టడం జరిగింది! హాయ్! హాయ్!

''థాంక్యూ, ధైర్యంగల కరూడా'' అన్నాడు నొప్పిడాక్టరు. ''నువ్వు అందరి ప్రాణాలూ రక్షించావు. నువ్వు గనక లేకపోయినట్లయితే మా ఆయువు మూడేది. అప్పుడు పాపం జబ్బుగా వున్న కోతులూ చచ్చిపోవును.''

''వుహుఁ'' అంది కరూడా. ''జైల్లోనుంచి తప్పించుకోవడం కోసం యేం చెయ్యాలో చెప్పింది మీరు'' అంది.

''గబగబా రోగిష్టి కోతుల దగ్గరికి పోదాం పదండి'' అన్నాడు డాక్టరుగారు. అడివిలోకి పరిగెత్తాడు. జంతువులన్నీ ఆయన వెనక వెళ్లాయి.






# కోతుల వంతెన

నొప్పిడాక్టరు జైలునుంచి పారిపోయాడని తెలిసి బార్మలేయ్ ఆగ్రహంతో రెచ్చిపోయాడు. కోపంతో కళ్లు తిప్పి కాళ్లతో నేలమీద తన్నాడు.

''ఏయ్! నా నమ్మిన బంటుల్లారా! ఆ డాక్టరు వెనక్కాల పరిగెత్తి, వాణ్ణి పట్టుకుని, యిక్కడికి తీసుకురండి'' అని అరిచాడు.

బంట్లు అడివిలోకి పరిగెత్తివెళ్లి నొప్పిడాక్టరుగారి కోసం వెదకడం మొదలు పెట్టారు. యీ లోపున నొప్పిడాక్టరుగారు జంతువులన్నిటితోటీ కలిసి ఆఫ్రికాలో కోతుల దేశానికి దారి చూసుకుంటూ పోతున్నాడు. ఆయన చాలా గబగబా

నడుస్తున్నాడు. చిన్న పంది గుర్రుగుర్రు కాళ్ళు చిన్నవి కావడంవల్ల ఆయనతో అందుకోలేకపోతోంది. దాంతోటి డాక్టరుగారు దాన్ని యెత్తుకుని తీసి కెళ్లాల్సి వచ్చింది. ఆ పంది చాలా బరువుగా వుంది. డాక్టరుగారికి అలసట వచ్చింది.

''అబ్బ, కాసేపు విశ్రాంతి తీసుకుంటే యెంత బాగుంటుంది! కోతుల దేశానికి మనం గబగబా చేరుకుంటే యెంత బాగుణ్ను!'' అనుకున్నాడు ఆయన.

చిచీ ఎత్తుగా వున్న చెట్టు యెక్కి, అక్కడ్నుంచి గట్టిగా అరిచింది:

''కోతుల దేశం కనిపిస్తోంది! దగ్గరే! త్వరగానే, మనం యిట్టే అక్కడికి చేరుకుంటాం.''

డాక్టరుగారు సంతోషంతో నవ్వాడు. ముందుకి దూకాడు.

రోగిష్టి కోతులు నొప్పిడాక్టరిని చూసి, చప్పట్లు కొట్టాయి, సంతోషంతో:

''భలే! నొప్పిడాక్టరుగారు వచ్చేశారు. ఆయన తక్షణం మనకి నయం చేస్తారు, రేపటికే మనం బాగయిపోతాం.''

కాని, సరిగ్గా ఆ సమయానికి నొప్పిడాక్టరు వెనక పరిగెత్తుకుంటూ బార్మలేయ్ బంట్లు అడవిలోంచి వచ్చేశారు.

''పట్టుకోండి! ఆయన్ని పట్టుకోండి!'' అని అరిచారు.

డాక్టరుగారు శక్తి అంతా కూడదీసుకుని పరిగెట్టాడు. యింతట్లోకీ ఒక నది అడ్డం వచ్చింది. నదేమో వెడల్పు యెక్కువ. యిక ఆయన ముందుకు వెళ్ల లేకపోయాడు. డాక్టరుగారూ, ఆయన జంతువులూ యీది దాన్ని దాటలేకపోవడం జరిగింది. బార్మలేయ్ బంట్లు ఆయన్నీ, వాటినీ పట్టేసేటట్టే కనిపించింది! ఆ



నదిమీద ఒక వంతెనంటూ వుంటే డాక్టరుగారూ, ఆయన జంతువులూ దానిమీద పరిగెత్తి కోతుల దేశం చేరడం జరిగేది!

''అయ్యో ఖర్మ!'' అంది చిన్న పంది గుర్రుగుర్రు. ''మనం యీ నదిని యెలా దాటగలం! యింకో క్షణంలో యీ దుర్మార్గులు వచ్చి మనల్ని పట్టుకుని జైల్లో పడేస్తారు'' అంది.

ఆ సమయంలో ఓ కోతి అరిచింది:

''వంతెన! వంతెన! వేళ మించి పోనివ్వకండి వంతెన కట్టండి! వూఁ నడవండి, వంతెన కట్టండి.''

డాక్టరుగారు చుట్టూతా చూశాడు. కోతుల దగ్గర ఇనుము గాని, రాళ్లు గాని లేవు. మరి వంతెన యెలా కడతాయి?

కాని కోతులు వంతెన కట్టాయి, ఇనుముతో కాదు

రాతితో కాదు. సజీవంగా వున్న కోతులతోటే. నది ఒడ్డున ఒక చెట్టు వుంది. ఒక కోతి దాని కొమ్మ పట్టుకొంది. యింకో కోతి దీని తోక పట్టుకుంది. యీ రకంగా కోతులు రెండు ఒడ్డులకీ మధ్య పెద్ద గొలుసులా తయారయాయి.

''యిదిగో మీ వంతెన'' అని అవి డాక్టరుగారికి చెప్పాయి. ''యెంత గబగబా అయితే అంత గబగబా పరిగెత్తండి.''

డాక్టరుగారు గుడ్లగూబ బుంబాని తీసుకుని కోతుల మీదుగా, వాటి తలల మీద నుంచీ, వీపుల మీదనుంచీ పరిగెత్తాడు. మిగతా జంతువులన్నీ ఆయన వెనక వెళ్ళాయి.

''పదండి! పదండి! త్వరగా'' అని కోతులు అరిచాయి.

సజీవంగా వున్న కోతుల వంతెనమీద నడవడం కష్టం.





జారి, నదిలో పడిపోతామేమోనని జంతువులకి భయం కలిగింది.

కాని వంతెన గట్టిది. కోతులన్నీ ఒకదాన్నొకటి గట్టిగా పట్టుకున్నాయి. డాక్టరుగారు కొంచెం సేపటిలోనే అవతలి ఒడ్డు చేరుకున్నారు. జంతువులు వెనకాల వెళ్లాయి.

''పదండి! పదండి! త్వరగా'' అంటూ డాక్టరుగారు అరిచాడు. ''ఆలస్యం చెయ్యద్దు. శత్రువులు వచ్చేస్తున్నారు, మనల్ని అందుకుంటారు. చూశారా వాళ్లు కూడా కోతుల వంతెన మీదనుంచి దాటేస్తున్నారు.... వాళ్లూ త్వరలో యిక్కడికి వచ్చేస్తారు. త్వరగా! త్వరగా!''

అరె, యేమిటది? యేం జరిగింది? చూడండి: సరిగ్గా వంతెన మధ్యలో కోతులు ఒక దాని తోక ఒకటి వదిలేశాయి. బార్మలేయ్ బంట్లు నదిలో పడిపోయారు.

''భేష్!'' అని కోతులు అరిచాయి. ''భేష్! నొప్పిడాక్టరుగారు క్షేమంగా వున్నారు. యిప్పుడిక ఆయన ఎవరన్నా భయపడక్కర్లేదు. శత్రువులు ఆయన్ని పట్టుకోలేకపోయారు. యిప్పుడాయన మన జబ్బుగా వున్న కోతుల్ని బాగు చేస్తాడు. మన నేస్తాలు యిక్కడే మూలుగుతూ వున్నాయి.''






# మొద్దు జంతువులు

నొప్పిడాక్టరు జబ్బుగా వున్న కోతుల దగ్గరికి వెళ్లాడు.

అవి నేలమీద పడి మూలుగుతున్నాయి. వాటికి చాలా జబ్బుగా వుంది.

డాక్టరుగారు వాటికి వైద్యం చెయ్యడం మొదలెట్టాడు. ప్రతి కోతికీ మందు యివ్వాలి. కొన్ని అరుకు తీసుకోవాలి. కొన్ని బిళ్లలు మింగాలి. ప్రతి కోతి తలమీద వాపు తగ్గేందుకు తడి గుడ్డ కట్టాలి, వీపుమీదా, ఛాతీమీదా ఆవ పట్టీలు వెయ్యాలి. రోగిష్టి కోతులేమో చాలా వున్నాయి. డాక్టరు మాత్రం ఒక్కడే.

అంత పని ఒక్క చేతిమీద యీడ్చడం యెవళ్లకేనా అసాధ్యమే.

మొసలి, కికా, కరూడొ, చిచీ, డాక్టరుగారికి సాయం చెయ్యడంలో ఒళ్ళు దాచుకోలేదు. కాని అవీ వేగంగానే అలిసిపోయాయి. డాక్టరుగారికి సాయం అవసరం.

డాక్టరుగారు ఒక సింహం వుంటున్న చోటుకి వెళ్లాడు.

''బాబ్బాబు మంచివాళ్ళు, రోగిష్టి కోతుల్ని బాగు చేసేందుకు నాకు సాయం రండి'' అని ఆయన సింహాన్ని అడిగాడు.

సింహం దర్పంగా వుంది. డాక్టరుగారి కేసి కొరకొర చూసింది.

''నేనెవరనుకుంటున్నారు? నేను సింహాన్ని. మృగ రాజుని. చెత్త కోతుల వైద్యానికి నన్ను సాయం రమ్మంటారూ. ఎన్ని గుండెలు!''

అప్పుడు డాక్టరుగారు ఖడ్గ మృగాల దగ్గరికి వెళ్లాడు.



''గౌరవనీయులైన ఖడ్గమృగాల్లారా! జబ్బుగా వున్న కోతులకి వైద్యం చెయ్యడానికి నాకు సాయం పడండి. కోతులు చాలా వున్నాయి. నేను ఒక్కణ్ణే అయిపోయి, అంత పనీ యీడవలేకపోతున్నాను'' అన్నాడాయన.



ఖడ్గమృగాలు ఆయన్ని చూసి వికటంగా నవ్వాయి.

''మేమెందుకు సాయం చెయ్యాలి మీకు? మిమ్మల్ని మా కొమ్ములతోటి చీల్చి చెండాడకుండా వదిలేసాం, అందుకే సంతోషించండి.''





దుష్ట ఖడ్గమృగాలంటే డాక్టరుగారికి చాలా కోపం వచ్చింది. దగ్గరలో వున్న అడివిలోకి వెళ్లాడు. అక్కడ చారల పులులు వున్నాయి.

''ప్రియమైన పులుల్లారా, దయచేసి నాకు సాయం చెయ్యండి రోగిష్టి

కోతులకి వైద్యం చెయ్యాలి.''

''గాం....గ్రదు....గ్రదు... పొండి లేకపోతే మిమ్మల్ని మింగేస్తాం'' అన్నాయి పులులు.

డాక్టరుగారు యెంతో దిగులుగా వెళ్లిపోయాడు.

కాని త్వరలోనే జాలిలేని ఆ జంతువులకి గట్టి శాస్తి జరిగింది.

సింహం యింటికి వెళ్లగానే ఆడసింహం చెప్పింది: ''మన చిన్నాడికి జబ్బుగా వుంది. రోజంతా ఏడుస్తూ మూలుగుతూనే వున్నాడు. ఆ ప్రఖ్యాత నొప్పిడాక్టరు గారు ఆఫ్రికాలో లేకపోవడం యెంత దురదృష్టం! ఆయన దివ్యమైన డాక్టరు. అందుకే ఆయనంటే అందరికీ అభిమానం. ఆయన మన బాబుకి నయం చెయ్య గలడు.''

''నొప్పిడాక్టరుగారు యిక్కడే వున్నాడు'' అని సింహం జవాబు చెప్పింది. ''ఆయన కోతుల దేశంలో వున్నాడు. ఆ తాటి చెట్ల వెనక. నేనిప్పుడే ఆయనతో మాట్లాడేను.''

''ఏం అదృష్టం!'' అని ఆడసింహం ఆనందపడింది. ''వూఁ యింకా చూస్తారేం, వెళ్లి ఆయన్ని తీసుకురండి'' అంది.

''వుహుఁ. నేను ఆయన దగ్గరకి వెళ్లను. ఆయన మన అబ్బాయికి వైద్యం చెయ్యడు. నేను ఆయన్ని కష్టపెట్టాను'' అంది సింహం.

''నొప్పిడాక్టరిని మీరు కష్టపెట్టారా? మనం యిప్పుడేం చెయ్యాలి? నొప్పి డాక్టరుగారిలాంటి హస్తవాసి వున్న అద్భుతమైన డాక్టరు యిక లేడని మీకు తెలీదా? జంతువుల భాష వచ్చిన మనిషి ఆయనొక్కడే. ఆయన పులులకి, మొసళ్లకి, కుందేళ్లకి, కోతులకి, కప్పలకి వైద్యం చేస్తాడు. అవును, కప్పలకి కూడా. ఆయనది అంత జాలి గుండె. అలాంటి ఆయన్ని మీరు కష్టపెట్టారు! అదీ మీ కన్న కొడుక్కి

జబ్బుగా వున్నప్పుడు! యిక యిప్పుడేం చేస్తారు?''

సింహానికి మాట పెగల్లేదు. యేం చెయ్యాలో తోచలేదు.

''డాక్టరుగారి దగ్గరకి వెళ్లండి'' అని ఆడసింహం అరిచింది. ''ఆయన కాళ్లమీద పడి లెంప లేసుకుని, ఆయనకేం కావాలో అన్నీ చెయ్యండి. ఆయనేం చెయ్యమంటే అది చేసి, మన బాబుకి నయం చెయ్యమని బతిమలాడండి.''

యిక చెయ్యగలిగిందేమీ లేక సింహం నొప్పిడాక్టరు దగ్గరికి వెళ్లింది.

''నమస్కారం డాక్టరుగారూ. మిమ్మల్ని క్షమించమని అడగడానికి వచ్చాను. నేను మీకు సాయం చేస్తాను.... నేను మందులు అందిస్తాను'' అంది.

అలాగే సింహం నొప్పిడాక్టరికి సాయపడింది. మూడు రోజులు అహో రాత్రాలూ సింహం రోగిష్టి కోతులకి సాయం చేసింది. అప్పుడు బెరుకు బెరుగ్గా డాక్టరుగారి దగ్గరికి వెళ్లి, యిలా అంది:

''నా ప్రాణంలో ప్రాణం అయిన మా బుజ్జిబాబుకి జబ్బుగా వుంది. దయ తలచి, మా బుజ్జిగాడికి వైద్యం చెయ్యరూ?''

''అలాగే. సంతోషంగా చేస్తాను. యివాళే మీ అబ్బాయికి నయం చేస్తాను'' అన్నాడు డాక్టరుగారు.

ఆయన సింహం గుహకి వెళ్లి, సింహం పిల్లకి అద్భుతమైన మందు యిచ్చాడు ఒక్క గంటలో దానికి తగ్గిపోయింది.

సింహం చాలా సంతోషించింది. అలాంటి జాలిగల డాక్టరుగారిని కష్ట పెట్టినందుకు సిగ్గుపడింది.

ఆ తర్వాత ఖడ్గమృగం పిల్లలకీ, పులి పిల్లలకీ జబ్బు చేసింది. నొప్పిడాక్టరు గారు వెంటనే వాటికి నయం చేశాడు. ఖడ్గమృగమూ, పులులూ అన్నాయి:

''మాకు సిగ్గుగా వుంది, మేం మిమ్మల్ని కష్టపెట్టాం.''

''దాన్దేముంది లెండి. యీ పైన వివేకంగా వుండండి. యిప్పుడు వచ్చి కోతులకి సాయం చెయ్యండి'' అన్నాడు డాక్టరుగారు.






# బహుమతీ

జంతువులు డాక్టరుగారికి యెంతగానో సాయం చేశాయి. దాంతోటి కోతులకి త్వరలోనే జబ్బు నయం అయింది.

''మా డాక్టరుగారి మేలు మరవలేం. యీ భయంకరమైన జబ్బు తగ్గించి నయం చేశాడు. యేదేనా మంచిది బహుమతీ యివ్వాలి. జనం సర్కస్‌లో గాని జూలో గాని యెన్నడూ చూసి వుండని జంతువుని బహుమానంగా యిద్దాం'' అనుకొన్నాయి అవి.

''ఆయనకి ఒంటెని యిద్దాం'' అంది ఓ కోతి.

''వుహూఁ'' అంది చిచీ. ''ఆయనకి ఒంటె అవసరం లేదు. ఆయన

ఒంటెల్ని చూశాడు. జనం అంతా ఒంటెల్ని జూలో చూశారు, వీధుల్లో చూశారు.''

''అయితే ఉష్ట్రపక్షి నిద్దాం'' అంది యింకో కోతి. ''ఆయనకి ఓ ఉష్ట్ర పక్షిని బహుమానంగా యిద్దాం.''

''వద్దు'' అంది చిచీ. ''ఆయన ఉష్ట్రపకుల్ని చూశాడు'' అంది.

''ఆయన తోపుడులాగుడుని చూశారా'' అని యింకో కోతి అడిగింది.

''వుహుఁ చూళ్ళేదు. యే మనిషీ యెన్నడూ తోపుడులాగుడుని చూసి వుండడు'' అంది చిచీ.

''బాగుంది. ఆయనకి తోపుడులాగుడుని కానుకగా యిద్దాం'' అన్నాయి కోతులు.






# తోపుదులాగుడు

జనం తోపుదులాగుడు జంతువులని యెన్నడూ చూసి వుండరు. వాటికి మనుషులంటే బెదురు. యెవడేనా మనిషి కనిపిస్తే వెంటనే అవి పొదల్లో దాంకుంటాయి.

మిగతా జంతువుల్ని అవి కళ్లు మూసుకుని నిద్రపోయేటప్పుడు పట్టుకో వచ్చు. వెనక్కాలే వెళ్లి తోక పట్టుకోవచ్చు. కాని తోపుదులాగుడుని వెనకనుంచి పట్టుకోలేరు. యేమంటే యెదర వున్నట్టే వెనకా దానికి తల వుంది.

అవును, దానికి రెండు తలలు వున్నాయి. ఒకటి యెదర, ఒకటి వెనక.

దానికి నిద్రపోవాల నిపించినప్పుడు ముందుగా ఒక తల నిద్రపోతుంది, తర్వాత రెండవది. రెండు తలలూ ఒకసారే యెప్పుడూ నిద్రపోవు. ఒక తల నిద్రపోయేటప్పుడు రెండోది చుట్టూ చూస్తూ వుంటుంది యే వేటగాడేనా వస్తు న్నాడేమోనని. అందుకనే ఒక్క వేటగాడు కూడా దీన్ని పట్టుకో లేకపోయాడు. అందుకనే ఒక్క సర్కస్‌లో గాని, జూలో గాని యీ జంతువు కనిపించదు.

నొప్పిడాక్టరుగారికి బహుమ తీగా యివ్వడానికి ఒక తోపుదు లాగుడుని పట్టుకోవాలని కోతులు తీర్మానించుకున్నాయి.

అవి గుబురుగా వున్న పొద లోకి పరిగెత్తివెళ్లి, తోపుదులాగుడు విశ్రాంతి తీసుకునే చోటుని కనిపెట్టాయి.

వాటిని చూడగానే అది పరుగు లంకించుకుంది. కాని



కోతులు దాన్ని చుట్టు ముట్టేశాయి. ఠపీమని పట్టేశాయి. యిలా చెప్పాయి:

''చూడమ్మా తోపుడులాగుడు, నువ్వు నొప్పిడాక్టరుగారితో కలిసి యిక్క డ్నుంచి చాలా దూరం వెళ్లిపోయి ఆయన యింట్లో జంతువులన్నిటితోనూ కలిసి వుంటావా? నీకక్కడ చక్కగా వుంటుంది, తిండి కొల్లలు, మంచి స్నేహితులు.''

తోపుడులాగుడు రెండు తలలూ ఆడించి, రెండు నోళ్లతోటీ

''వుహుఁ'' అంది.

''డాక్టరుగారు చాలా మంచి మనిషి'' అన్నాయి కోతులు. ''ఆయన నీకు తేనె తుట్టెలు పెడతాడు. యేదేనా నలత చేస్తే నయం చేస్తాడు.

''అయినా గానీ, నేనిక్కడే వుంటాను'' అంది తోపుడులాగుడు.

మూడ్రోజుల పాటు కోతులు తోపుడులాగుడుని బలవంతం చేస్తూనే వున్నాయి. ఆఖరికి తోపుడులాగుడు ఒప్పుకుని, అంది:

''సరే, ప్రముఖ వైద్యుడంటున్నారు కదా, ఆయన్ని నాకు చూపించండి. ఆయనెలా వుంటాడో చూడాలని వుంది నాకు.''

కోతులు దాన్ని నొప్పిడాక్టరుగారు వుంటున్న కుటీరానికి తీసికెళ్లాయి. తలుపు తట్టాయి.

''లోపలికి రండి'' అంది కికా.

చిచీ సగర్వంగా ఆ రెండు తలల జంతువుని లోపలికి తీసికెళ్లింది.

''ఏంటిది?'' అని డాక్టరుగారు ఆశ్చర్యపోయాడు.

యిలాంటి వింతని ఆయన యింతకు ముందెన్నడూ చూడలేదు.

''యిది తోపుడులాగుడు'' అంది చిచీ. ''దీనికి మిమ్మల్ని చూడాలని వుందట. ఆఫ్రికా అడవుల్లో చాలా అరుదుగా వుండే జంతువు తోపుడులాగుడు. దీన్ని మీ ఓడలో తీసికెళ్లి మీ యింట్లో వుంచుకోండి.''



''కాని మనింట్లో వుండడానికి యిది ఒప్పుకుంటుందా?''

''సంతోషంగా మీతో వస్తాను'' అంది తోపుదులాగుడు. అది అం తొందరగా ఒప్పుకుంటుందని ఎవరూ అనుకోలేదు. ''మీరు జాలిగుండె వాళ్ల వెంటనే నాకు తెలిసిపోయింది. మీ కళ్లు దయగా వుంటాయి. జంతువు మిమ్మల్ని ప్రాణప్రదంగా ప్రేమిస్తాయి. మీకు కూడా జంతువులంటే ప్రేమ అ



నాకు తెలుసు. కాని మీరు నాకొక మాట యివ్వాలి. నాకు గనక మీ యింటి దగ్గర తోచకపోతే, నన్ను మళ్లీ ఆఫ్రికా పంపెయ్యడానికి మీరు వూఁ అనాలి.''

''అలాగే, వెళ్లిపోనిస్తాను. కాని మా యింట్లో యెంతో బాగుంటుంది,



నీకసలు వెనక్కి వెళ్ల బుద్ధెయ్యదు.''

''అవును, అవును, నిజమే'' అంది చిచీ. ''మా డాక్టరుగారు హుషారైన వాడు, ధైర్యవంతుడు. ఆయన యింట్లో మాకు కావలసినంత స్వేచ్ఛ వుంది.

దగ్గర్లోనే, పిలిస్తే పలికేటంత దూరంలో తాన్యా, వాన్యలు వుంటారు. నువ్వే చూస్తావుగా, నువ్వంటే వాళ్లు యెంత యిష్టపడతారో. వాళ్లు నీకు ప్రాణ మిత్రులైపోతారు.''

''అలా అయితే ఒప్పుకుంటాను. మీతో వస్తాను'' అంది తోపుదులాగుడు. చాలా సేపటి తర్వాత తన రెండు తలల్నీ నొప్పిడాక్టరుగారి కేసి అంగీకారంగా ఆడించింది.





# కోతులు డాక్టరుగారికి సెలవు చెప్పడం

ఆ సమయంలో కోతులు డాక్టరుగారి దగ్గరికి వచ్చి భోజనానికి పిలిచాయి. అవి భేషైన వీడ్కోలు విందు యేర్పాటుచేశాయి: ఆపిల్ పళ్ళు, తేనె, అరటి పళ్ళు, ఖర్జూరం పళ్ళు, ఆప్రికాట్‌లు, నారింజలు, వేరుశనగలు, రైజిన్‌లు పెట్టాయి.

''నొప్పిడాక్టరుగారు చిరకాలం జీవించాలి'' అని కోతులు అరిచాయి. ''ఆయనంతటి జాలిగల మనిషి యీ భూమ్మీద లేడు.''

ఆ తర్వాత అవి అడివిలోకి పరిగెత్తుకెళ్లి ఓ పెద్ద బండరాతిని తీసుకొచ్చాయి.

''నొప్పిడాక్టరుగారు జబ్బుపడ్డ కోతుల్ని నయం చేసిన చోట యీ రాయి

వుంటుంది. జాలిగుండె డాక్టరుగారి జ్ఞాపక చిహ్నంగా వుంటుందిది.''

డాక్టరుగారు టోపీ తీసేసి, కోతులకి వంగి వందనం చేసి యిలా అన్నాడు:

''సెలవ్ ప్రియ నేస్తాల్లారా! మీ ప్రేమాభిమానాలకి కృతజ్ఞుణ్ణి. త్వరలోనే మళ్ళీ మీ దగ్గరికి వస్తాను. అందాకా మొసలినీ, కోతి చిచీనీ, చిలక కరూడానీ మీ దగ్గర వుంచుతాను. అవి ఆఫ్రికాలో పుట్టాయి. యిక్కడ తమ అన్నదమ్ములతో, అక్క చెల్లెళ్లతో వుంటాయి. సెలవ్.''

''లేదు, లేదు'' అంటూ మొసలీ, చిలక కరూడా, కోతి చిచీ అరిచాయి. ''మా తోబుట్టువులంటే మాకు ప్రేమే కాని మిమ్మల్ని వదిలి మేం వుండం'' అన్నాయి.

''మీరు లేని లోటు నాకూ అనిపిస్తుంది. కాని మీరిక్కడ యెప్పటికీ యేం వుండిపోరు. మూడు నాలుగు నెలల్లో నేను మళ్ళీ వస్తాను. అప్పుడు మీరు నాతో వెనక్కి వద్దురు గాని. మనం మళ్ళీ కలిసి వుందాం, పని చేద్దాం'' అన్నాడు డాక్టరుగారు.

''అలా అయితే వుంటాం. కాని, త్వరగా రండి బాబూ!'' అన్నాయి అవి.

డాక్టరుగారు మనస్ఫూర్తిగా అన్నిటి దగ్గరా సెలవు తీసుకొని, రోడ్డుమీద నడిచి వెళ్లిపోయాడు. కోతులు ఆయన్ని సాగనంపాయి. డాక్టరుగారితోటి ప్రతి కోతికీ షేక్‌హాండ్ చెయ్యాలనే. కాని కోతులు యెన్నో వుండడంవల్ల సాయంత్రం దాకా షేక్‌హాండ్ కార్యక్రమం సాగింది. డాక్టరుగారి చెయ్యి నొప్పిపుట్టింది.

సాయంత్రం వేళ దురదృష్టం దాపురించింది.

నదిని దాటగానే డాక్టరుగారు దుష్ట గజదొంగ బార్మలేయ్ రాజ్యంలోకి వచ్చాడు.

''హుష్'' అంది బుంబా. ''గట్టిగా మాట్లాడద్దు. ఆ దొంగలు మనల్ని పట్టేస్తారు'' అంది.





# కొత్త కష్టాలూ, సంతోషాలు

బుంబా యీ మాటలు అందోలేదో బార్మలేయ్ బంట్లు అడివిలోనుంచి పరిగెత్తుకుంటూ వచ్చి దయగల డాక్టరుగారి దగ్గరికి దూసుకుపోయారు. యెంతో సేపట్నుంచి ఆయన కోసం కాచుకుని వున్నారు.

''యెట్టకేలకి, యెట్టకేలకి మిమ్మల్ని పట్టాం. యిక మా నుంచి తప్పించుకుపోలేరు!'' అని వాళ్లు అరిచారు.

డాక్టరుగారు యేం చేస్తాడు? క్రూరులైన శత్రువుల దగ్గరనుంచి ఆయన యెలా తప్పించుకుపోగలడు?



అయినా డాక్టరుగారు తత్తర పడలేదు. ఒక్క క్షణంలో ఆయన తోపుదు లాగుడు వీపుమీదకి యెగిరాడు. అది అడివి గుఱ్ఱంలాగా దౌడు తీసింది. బార్మలేయ్ బంట్లు డాక్టరుగారి వెనకాల పరిగెత్తారు. కాని తోపుదులాగుడుకి రెండు తలలు వుండడంతోటి, వెనకనుంచి దాడి చెయ్యబోయిన ప్రతి దొంగనీ అది కరిచింది. కొంతమంది దొంగల్ని కొమ్ములతో చీల్చేసి, ముళ్ల పొదల్లోకి విసిరేసింది.

మరి తోపుదులాగుడు ఒక్కటే అంత మంది దుర్మార్గులతోటే తలపడలేదు కదా. డాక్టరుగారి నమ్మకమైన నేస్తాలు ఆయనకి సాయం చెయ్యడానికి పరిగెత్తాయి. మొసలి ఆ దుర్మార్గుల దిస పాదాలని కరిచింది. కుక్క అవ్వా భయంకరంగా అరి చింది. వాళ్లని తోసి పారేసింది. వాళ్ల మెళ్లమీద తన కోరలు దించింది. కోతి చిచీ పెద్దపెద్ద కాయల్ని దొంగలమీదకి చిటారు కొమ్మలపైనుంచి విసిరింది.

దొంగలు బాధతో మూలుగుతూ పడిపోయారు. ఆఖరికి కాలికి బుద్ధి చెప్పాల్సివచ్చింది.

సిగ్గూశరం లేకుండా అడవిలోకంటూ పారిపోయారు.

''భేష్'' అంటూ నొప్పిడాక్టరు అరిచాడు.

''భేష్'' అని జంతువులు అరిచాయి.

చిన్న పంది గుర్రుగుర్రు అంది:

''అమ్మయ్య, యింక విశ్రాంతి తీసుకోవచ్చు. పట్టండి గడ్డిమీద పడుకుందాం. అలిసిపోయాం, నిద్రవస్తోంది.''

''లేదు, మిత్రులారా! మనం త్వరపడాలి. యిక్కడ వుంటే నాశనం అయిపోతాం'' అన్నాడు డాక్టరుగారు.

అవి శక్తి కొద్దీ ముందుకు పోయాయి. త్వరలోనే తోపుదులాగుడు డాక్టరుగారిని సముద్రం ఒడ్డుకి చేర్చింది. అక్కడ, పెద్ద రాతి వార అఘాతంలో ఒక అందమైన ఓడ లంగరు వేసి వుంది. అది బార్మలేయ్ ఓడ.

''మనం బతికాం'' అని డాక్టరుగారు అరిచాడు.

ఓడమీద ఒక్క పురుగు లేదు. డాక్టరుగారు తన జంతువులన్నిటితోటీ కలిసి గబగబా ఓడ యెక్కేశాడు. తెరచాపలు యెత్తారు. సముద్రం కేసి ప్రయాణం సాగింది. కాని కొంచెం దూరం వెళ్లీ వెళ్లగానే బార్మలేయ్ అడివిలోనుంచి యివతలికి పరిగెత్తుతూ వచ్చాడు.

''ఆగండి! ఆగండి! యెక్కడికి నా ఓడని తీసుకుపోతున్నారు? తక్షణం వెనక్కి రండి!'' అని అరిచాడు.

''లేదు!'' అని డాక్టరుగారు మళ్లీ అరిచాడు. ''నీ దగ్గరకి తిరిగిరాం! నువ్వు పరమ దుర్మార్గుడివి, దుష్టుడివి! నువ్వు మా జంతువులకి కష్టాలు

కలిగించావు. నన్ను జైల్లో తోశావు. నన్ను చంపెయ్యాలనుకున్నావ్. నువ్వు మా శత్రువ్వి. నువ్వంటే మాకసహ్యం. నీ ఓడని తీసుకుపోతున్నా, నువ్విక సముద్ర దొంగ తనాలు చెయ్యకుండా వుంటావని. రక్షణలేని ఓడలు యీ ఒడ్డుకు వచ్చినప్పుడు యిక నువ్వు కొల్లగొట్టలేవు!''

బార్మలేయ్ కోపంతో వూగిపోయాడు, ఒడ్డమ్మటే పరిగెత్తాడు. శాపనార్థాలు పెట్టాడు. ముష్టి బిగించాడు. పెద్ద రాళ్లని ఓడ కేసి విసిరాడు. కాని డాక్టరు గారు వూరికే నవ్వాడంతే. బార్మలేయ్ ఓడని నేరుగా తన దేశం కేసి తీసుకు పోయాడు. కొద్ది రోజుల్లో తన సొంత తీరం చేరుకున్నాడు.






# తోపుడులాగుడూ, వర్వారా

అవ్వా, బుంబా, కికా, చిన్న పంది గుర్రుగుర్రు యింటికి తిరిగివచ్చినందుకు చాలా సంతోషపడ్డాయి. ఒడ్డున వాన్య, తాన్యాలని చూశాయి. వాళ్లు ఆనందంతో గంతులు వేస్తున్నారు. నావికుడు రాబిన్‌సన్ దగ్గర నుంచున్నాడు.

''హల్లో, నావికా రాబిన్‌సన్!'' అని ఓడ మీదనుంచి నొప్పిడాక్టరు అరిచాడు.

''రండి, రండి, స్వాగతం'' అన్నాడు రాబిన్‌సన్. ''మీ యాత్ర యెలా

జరిగింది? జబ్బు కోతులకి నయం చేశావా? యేదీ, నా ఓడ యేమైంది?'' అని అడిగాడు.

''అయ్యో, యేం చెప్పమంటావు? నీ ఓడ మునిగిపోయింది. ఆఫ్రికా ఒడ్డునే రాళ్లకి ఢీకొని నుగ్గునుగ్గయి పోయింది. కాని ఆ పాత దానికంటే బాగా వుండే కొత్త ఓడని తెచ్చాను నీ కోసం'' అన్నాడు డాక్టరుగారు.

''థాంక్యూ. యీ ఓడ బ్రహ్మాండంగా వుంది. నా పాత ఓడా మంచిదే ననుకో, కాని యిది దివ్యంగా వుంది. యిది యెంతో పెద్దదీ, అందంగా వుంది'' అన్నాడు రాబిన్‌సన్.

డాక్టరు రాబిన్‌సన్ దగ్గర సెలవు తీసుకుని తోపుడులాగుడు వీపుమీద కూర్చుని నగరపు వీధులగుండా యింటికి స్వారీ చేసుకుంటూ వెళ్లిపోయాడు. ప్రతి వీధిలోనూ బాతులు, పిల్లులు, టర్కీకోళ్లు, కుక్కలు, పందులు, ఆవులు, గుర్రాలు డాక్టరుగారికి అభివాదం చెయ్యడానికి బయటికి పరిగెత్తివచ్చాయి. అవన్నీ కూడా బిగ్గరగా అరిచాయి:

''మలకూచా! మలకూచా!''

అంటే జంతువుల భాషలో ''నొప్పిడాక్టరుగారు వర్ధిల్లాలి!'' అని అర్థం.

పక్షులు పట్టణం అన్ని వేపులనుంచీ యెగిరివచ్చాయి. డాక్టరుగారి తలపైన వర్తులంగా ఎగిరి, ఆయన గురించి హుషారైన పాటలు పాడాయి.

యింటికి తిరిగివచ్చినందుకు డాక్టరుగారు సంతోషించాడు.

నొప్పిడాక్టరుగారి అధ్యయన మందిరంలో ముళ్లపందులు, కుందేళ్లు, ఉడతలు యింతకు ముందటి లాగానే వున్నాయి. మొదట్లో అవి తోపుడులాగుడు అంటే బెదిరాయి. కాని తర్వాత దానికి అలవాటు పడి, దాన్ని అభిమానించాయి.


జిందాబాద్!
జిందాబాద్ నొప్పిడాక్టరు!
అందుకో వందనం నొప్పిడాక్టరు!

తాన్యా, వాన్యలు తోపుదులాగుదుని చూడగానే నవ్వి సంతోషంతో కేకలు వేసి, చప్పట్లు చరిచారు. వాన్య తోపుదులాగుదు ఒక తలని కాగలించుకుంటే, తాన్యా యింకో తలని. మొత్తం ఒక గంట సేపు వాళ్లు దాన్ని నిమిరి, చేతులు కలిపి ''త్కాల్లా'' నాట్యం చేశారు – వాళ్లు చిచీ దగ్గర నేర్చుకున్న సంతోషపూర్వకమైన జంతు నృత్యం అది.

''చూశారా, నేను అన్న మాట నిలబెట్టుకున్నాను. మీకు ఆఫ్రికానుంచి అద్భుతమైన బహుమానం తెచ్చాను. పిల్లలెవరికీ అలాంటి బహుమతీ యెన్నడూ రాలేదు. మీకు యిది నచ్చినందుకు చాలా సంతోషంగా వుంది.''

మొదట్లో తోపుదులాగుదుకి జనం అంటే బెరుగ్గా వుండేది. అటకమీదనో నేలమాళిగలోనో దాంకునేది. కాని తర్వాత అలవాటు పడింది. తోటలోకి వచ్చేది. తన చుట్టూ జనం తనని చూడ్డానికి మూగినందుకు, తనని ప్రకృతిలో అద్భుతం అని పిలిచినందుకు సంతృప్తి చెందేది కూడా.

గట్టిగా ఒక నెల కాకుండానే తోపుదులాగుదు ధైర్యంగా వీధుల్లో నడిచేది. ఎప్పుడూ కూడా అంటి పెట్టుకుని వుండే తాన్యా, వాన్యలు తోడు వుండేవాళ్లు. తరుచుగా వేరే పిల్లలు వాళ్ల దగ్గరికి వచ్చి, ఒకసారి యెక్కనిమ్మని అడిగేవాళ్లు. తోపుదు లాగుదు యెప్పుడు యెవళ్లనీ కాదన లేదు. అది వెంటనే మోకాళ్లమీద వాలేది. చిన్న అబ్బాయిలూ, అమ్మాయిలూ దాని వీపుమీదకి యెక్కేవాళ్లు. తోపుదు లాగుదు వాళ్లని పట్టణం అంతా తిప్పేది, తన రెండు తలల్నీ సంబరంగా వూపుతూ సముద్రం ఒడ్డు దాకా తీసికెళ్లేది.

తాన్యా, వాన్యలు తోపుదులాగుదు కేశానికి రంగుల రిబ్బన్లు కట్టి, వెండి మువ్వలు కట్టి షోకు చేసేవాళ్లు. యిద్దరూ చెరి వొక మెడనీ అలా అలంకరించే వాళ్లు. తోపుదులాగుదు పట్టణంలో నడిచేటప్పుడు ఆ మువ్వల మోత జనానికి



వినిపించేది. యీ చిరు మువ్వల చప్పుడు విని, అందరూ యిళ్లల్లోనుంచి వీధుల్లోకి మరో సారి తోపుడులాగుడుని చూడ్డం కోసం పరిగెత్తుకొచ్చేవాళ్లు.

విషపుచ్చి వర్వారాకి తోపుడులాగుడుమీద యెక్కి వూరేగాలని అనిపించింది.

ఆమె దాని వీపుమీద యెక్కి దాన్ని తన గొడుగుతో పొడవడం మొదలెట్టింది.

''త్వరగా పరిగెత్తు! రెండు తలల గాడిదా!'' అనేది.

తోపుడులాగుడుకి కోపం వచ్చింది. అది యెత్తుగా వున్న గుట్ట యెక్కి వర్వారాని సముద్రంలోకి తోసేసింది.

''అయ్యో, మునిగిపోతున్నాను, రక్షించండి'' అని వర్వారా అరిచింది.

కాని యెవళ్లకీ ఆమెని రక్షించాలని అనిపించలేదు. ఆమె మునిగి పోతోంది.

''అవ్వా, అవ్వా, నా అవ్వా నన్ను ఒడ్డుకి చేర్చేందుకు సాయం చెయ్యండ్రా'' అని అరిచింది.

కాని అవ్వా ''ర్ – ర్ – ర్'' అంది.

అంటే జంతువుల భాషలో,

''నిన్ను కాపాడను, యేమంటే నువ్వు విషపుచ్చివి, దరిద్రపు గొట్టువి'' అని అర్థం.

ఆ సమయంలో నావికుడు రాబిన్‌సన్ తన ఓడమీద అటే వెడుతున్నాడు. అతను వర్వారాకి ఒక తాడు విసిరి, ఆమెని నీళ్లల్లోనుంచి యివతలికి లాగాడు. సరిగ్గా ఆ సమయంలో నొప్పిడాక్టరుగారు తన జంతువులతో కలిసి సముద్రం ఒడ్డున షికారు వెడుతున్నాడు. ఆయన నావికుడు రాబిన్‌సన్‌కి అరిచాడు:

''ఆమెని యిక్కడ నుంచి యెక్కడికేనా దూరంగా తీసుకుపో, ఆమె మా యింట్లో వుండడం మా జంతువుల్ని కొట్టడం నాకు యిష్టం లేదు.

రాబిన్‌సన్ ఆమెని నిర్జన ద్వీపంమీదకి దూరంగా యెక్కడికో తీసుకు పోయాడు. యిక ఎవర్నీ ఆమె అక్కడ వేధించలేదు.

నొప్పిడాక్టరు తన చిన్న యింట్లో ఆనందంగా వున్నాడు. పొద్దుటినుంచి

సాయంత్రం దాకా అన్ని వేపులనుంచీ తన దగ్గరికి వచ్చిన జంతువులకి, పక్షులకి వైద్యం చేస్తూ వుండేవాడు.

ఆ విధంగా మూడేళ్లు గడిచాయి. ప్రతి వాళ్లకీ ఆనందంగా వుంది.



# రెండవ భాగం

# పెంట్యా, సముద్రపు దొంగలు






# గుహ

నొప్పిడాక్టరికి షికారు వెళ్లడం అంటే యిష్టం.

ప్రతి రోజూ సాయంత్రం, పనైపోయాక, ఆయన గొడుగు తీసుకుని తన జంతువులతోటి అడివిలోకో, పొలంలోకో షికారు వెళ్లేవాడు.

ఆయన పక్కనే తోపుదులాగుడు నడిచేది. బాతు కికా అందరికంటే ముందు పరిగెత్తేది. కుక్క అవ్వా, చిన్న పంది గుర్రుగుర్రు వెనక్కాల నడిచేవి. ముసలి గుడ్లగూబ బుంబా డాక్టరుగారి భుజంమీద కూర్చునేది.

ఆయనా, అవీ యింటి దగ్గరనుంచి చాలా దూరం నడిచిపోతూ వుండడం,



డాక్టరుగారు అలిసిపోయి తోపుడులాగుడు వీపుమీద యెక్కడం, అది హుషారుగా గుట్టలగుండా పచ్చిక బీళ్లగుండా దౌడు తీయడం వుండేది.

ఒక రోజున మామూలుగా షికారు వెడుతూ వుంటే సముద్రం ఒడ్డున జంతువులకి ఒక గుహ కనిపించింది. అవి లోపలికి వెడదా మనుకున్నాయి గాని గుహకి పెద్ద తాళం వేసి వుంది.

''వూహించండి, యీ గుహలో యేం వుందో'' అంది అవ్వా.

''తేనె పట్లు అయివుంటాయి'' అంది తోపుడులాగుడు. తియ్యటి తేనె పట్టులంటే మిగిలినవాటన్నిటికంటే యెక్కువగా దానికే యిష్టం.

''వుహుఁ, పళ్ల రసాలూ, గింజలూ'' అంది కికా.

''వూహుఁ. చక్కటి ఆపిల్ పళ్లూ, బీట్‌రూట్‌లూ, కారట్‌లూ గింజలూ'' అంది గుర్రుగుర్రు.

''మనం తాళం చెవి సంపాదించాలి'' అన్నాడు డాక్టరుగారు. ''వెళ్లి తాళం చెవి కోసం వెతకండి'' అన్నాడు.

జంతువులు అన్ని వేపులకీ చెదిరిపోయి, ఆ గుహ తాళం చెవి కోసం వెతకడం మొదలెట్టాయి. ప్రతి రాతి కిందా, ప్రతి పొదలోనూ వెతికాయి. కాని తాళం చెవి కనిపించలేదు.

అప్పుడవి తాళం వేసిన గుహ తలుపు దగ్గర మళ్లీ పోగయి, తలుపు కంత గుండా లోపలికి తొంగి చూడ్డం మొదలెట్టాయి. కాని గుహలో చీకటిగా వుండి వాటికి యేం కనిపించలేదు. వున్నట్టుండి గుడ్లగూబ బుంబా అంది:

''సద్దు చెయ్యకండి. గుహలో యెవళ్లో వున్నట్టుంది. మనిషేనా అయి వుండాలి, జంతువేనా అయివుండాలి.''

అన్నీ పొంచి విన్నాయి. డాక్టరుగారూనూ. కాని యేం వినిపించలేదు.

''నువ్వు పొరపడ్డావేమో, నాకేం వినిపించడం లేదు'' అన్నాడు డాక్టరుగారు.

''అది సహజమే. మీకు వినిపించదు. మీ చెవుల వినికిడి నా చెవులకంటే తక్కువ'' అంది బుంబా.

''అవును, మాకూ యేం వినిపించడం లేదు'' అన్నాయి జంతువులు.

''కాని నాకు వినిపిస్తోంది'' అంది బుంబా.

''యేం వినిపిస్తోంది?'' అని నొప్పిడాక్టరు అడిగాడు.

''ఎవరో చెయ్యి జేబులో పెట్టుకుంటున్నట్టు వినిపిస్తోంది.''

''భలే ఆశ్చర్యంగా వుందే. నీకలాంటి అద్భుతమైన వినికిడి శక్తి వుందని నేను వూహించనే లేదు. మళ్లీ విని యేమిటో చెప్పు.''

''ఆ మనిషి చెక్కిళ్లమీదుగా కన్నీటి బొట్లు జారుతున్నాయి.''

''కన్నీటి బొట్లా?'' అన్నాడు డాక్టరుగారు. ''కన్నీటి బొట్లు! అంటే యెవళ్లో యేడుస్తున్నారన్న మాట! మనం యీ మనిషికి సాయం చెయ్యాలి. అతనికి ఘోరమైన దురదృష్టం సంభవించి వుంటుంది. మనుషులు యేడవడం నాకు యిష్టం వుండదు. ఓ గొడ్డలి పట్టండి, యీ తలుపు బద్దలు కొడతాను'' అన్నాడు డాక్టరుగారు.





## పెంటా

తోపుడులాగుడు యింటికి పరిగెత్తిపోయి, వాడిగా వుండే గొడ్డల్ని తెచ్చింది. డాక్టరుగారు గొడ్డలితోటి శక్తి కొద్దీ తలుపుమీద మోదాడు. మూడో దెబ్బ పడేటప్పటికి తలుపు బద్దలైంది. డాక్టరుగారు గుహలో ప్రవేశించాడు.

గుహలో చీకటిగా, చలిగా, చెమ్మగా వుంది. యేదో దుర్వాసన వస్తోంది!

డాక్టరుగారు అగ్గిపుల్ల గీశాడు. గుహలో చాలా చెత్తగా వుంది! ఓ బల్ల గాని, ఓ కుర్చీ గాని లేవు! కుళ్లిపోయిన గడ్డి మోపుమీద ఓ చిన్న పిల్లాడు కూర్చుని యేడుస్తున్నాడు.

డాక్టరుగారినీ, ఆ జంతువుల్నీ చూడగానే ఆ కుర్రాడు బెదిరిపోయాడు. యింకా గట్టిగా యేడవడం మొదలెట్టాడు. అయినా డాక్టరుగారి దయగల వదనం చూసి యేడవడం మానేశాడు.



''మీరు సముద్రపు దొంగ కాదు కదా'' అన్నాడు.

''వుహుఁ, నేను సముద్రపు దొంగని కాదు. నన్ను నొప్పిడాక్టరు అంటారు. సముద్రపు దొంగని కాను. యేం అలా కనిపిస్తున్నానా?''



''లేదు. మీ చేతిలో గొడ్డలి వున్నా నాకేం భయం వెయ్యటంలా. బాగున్నారా? నా పేరు పెంటా. మా నాన్న యెక్కడ వున్నాడో మీకు తెలుసా?'' అన్నాడా పిల్లాడు.

''వుహుఁ. మీ నాన్న యెక్కడికి వెళ్లి వుంటాడు? ఎవరాయన? ఆయన్ని గురించి చెప్పు'' అన్నాడు డాక్టరుగారు.

''మా నాన్న చేపలు పడతాడు. కితం రాత్రి మేం చేపలు పట్టడానికి సముద్రంలోకి వెళ్లాం. నేను చేపల పడవలో వున్నాను. హఠాత్తుగా సముద్రపు దొంగలు దాడి చేసి మమ్మల్ని బందీలుగా పట్టుకున్నారు. మా నాన్న కూడా వాళ్లల్లాగే సముద్రపు దొంగ కావాలని వాళ్లు అన్నారు. వాళ్లతోబాటుగా సముద్రాలమీద దొంగతనాలు చేసి, కొల్లగొట్టి, ఓడల్ని ముంచెయ్యాలట. కాని సముద్రపు దొంగ కావడం మా నాన్నకి యిష్టం లేదు. 'నేను న్యాయమైన మత్స్యకారుణ్ణి. నేను సముద్రపు దొంగతనాల్లోకి దిగను' అన్నాడాయన. అప్పుడు ఆ దొంగలకి కోపం వచ్చింది. వాళ్లు మా నాన్నని పట్టుకుని అవతలికి తీసికెళ్లిపోయారు. నన్ని గుహలో బంధించారు. మా నాన్నని యెక్కడికి తీసికెళ్లిపోయారో నాకు తెలీదు. అప్పటినుంచీ ఆయన నాకు కనిపించలేదు. ఆయనెక్కడున్నాడు? ఆయన్నేం చేశారు వాళ్లు? ఆయన్ని సముద్రంలోకి తోసేసి వుంటారు, ఆయన మునిగిపోయి వుంటాడు'' అని చెప్పి ఆ కుర్రాడు యేడవడం మొదలెట్టాడు.

''యేడవకు! యేడిచి యేం లాభం? మీ నాన్నని యెలా కాపాడాలో ఆలోచిద్దాం. మీ నాన్న యెలా వుంటాడో చెప్పు'' అన్నాడు డాక్టరుగారు.

''ఆయన జుట్టు ఎర్రగా వుంటుంది, గడ్డం ఎర్రగా బారుగా వుంటుంది.''

నొప్పిడాక్టరుగారు బాతు కికాని పిలిచి దాంతో మెల్లిగా అన్నాడు:

''చారి — బారి, చావా — చమ్.''

''చుకా – చుక్'' అంది కికా.

యీ సంభాషణ విని ఆ కుర్రాడు అన్నాడు:

''యేం తమాషాగా మాట్లాడుకున్నారు మీరు! నాకు ఒక్క ముక్క అర్థంకాలేదు.''

''నేను మా జంతువులతోటి వాటి భాషలోనే మాట్లాడతాను. నాకు జంతువుల భాష వచ్చు'' అన్నాడు డాక్టరుగారు.

''ఆ బాతుకి యేం చెప్పారు మీరు?'' అని కుర్రాడు అడిగాడు.

''డాల్ఫిన్స్‌ని పిలవమని చెప్పాను'' అన్నాడు డాక్టరుగారు.





# డాల్ఫిన్స్

బాతు సముద్రం ఒడ్డుకి పరిగెత్తివెళ్లి గట్టిగా

''ఓయ్ డాల్ఫినుల్లారా! యిటు రండి! నొప్పిడాక్టరుగారు పిలుస్తున్నారు!'' అని అరిచింది.

తక్షణం డాల్ఫిన్స్ ఒడ్డుకి యీదుకుంటూ వచ్చాయి.

''నమస్కారం డాక్టరుగారూ! మా వల్ల యేం పని కావాలి మీకు?'' అని అవి అడిగాయి.

''పెద్ద దురదృష్టం సంభవించింది. నిన్న ఉదయం సముద్రపు దొంగలు



ఒక బెస్తవాడిమీద దాడి చేసి, అతన్ని కొట్టారు. అతన్ని సముద్రంలోకి తోసేశారని తెలుస్తోంది. అతను మునిగిపోయాడేమోనని నాకు భయంగా వుంది. మొత్తం సముద్ర మంతా వెదకండి. సముద్రం అడుగున వుంటాడేమో చూడండి'' అన్నాడాయన.

''యెలా వుంటాడతను?'' అని డాల్ఫిన్స్ అడిగాయి.

''ఎర్ర తల మనిషి. అతని జుట్టు ఎర్రగా వుంటుంది. పొడుగాటి ఎర్రటి గడ్డం వుంటుంది. దయచేసి యెక్కడున్నాడో చూడండి.''



''సరే, మా ప్రియమైన డాక్టరుగారికి సేవచెయ్యడమంటే మాకు సంతోషం. మేం మొత్తం సముద్రం అంతా వెతుకుతాం. అన్ని చేపల్నీ, సముద్ర జంతువుల్నీ అడుగుతాం. ఆ ఎర్ర తల బెస్తవాడు మునిగిపోయినట్లైతే ఆ విషయం మీకు తెలియజేస్తాం, రేపటికల్లా'' అన్నాయి.

డాల్ఫిన్స్ తిరిగి సముద్రంలోకి యీదుకుంటూపోయాయి. ఆ మత్స్యకారుడి కోసం వెతకడం మొదలెట్టాయి. అన్ని చోట్లా వెతికాయి. సముద్రం అడుగున,

ప్రతి రాతికింద, ప్రతి కంతలోనూ వెతికాయి. అన్ని సముద్ర జంతువుల్నీ, చేపల్నీ అడిగాయి కాని, యెక్కడా మత్స్యకారుడు కనిపించలేదు.

ఉదయం నొప్పిడాక్టరుగారి దగ్గరికి యీదుకుంటూ వెళ్లి ఆయనకి చెప్పాయి: ''బెస్తవాడు కనిపించలేదు. మొత్తం సముద్రం అంతా గాలించేశాం.''

ఆ మాటకి ఆ కుర్రాడు చాలా సంతోషపడ్డాడు.

''అంటే మా నాన్న బతికే వున్నట్టు! బతికే వున్నట్టు!'' అని అరుస్తూ సంతోషంతో గంతు వేసి, చప్పట్లు కొట్టాడు.

''నిజంగా అతను బతికి వున్నట్టే'' అన్నాడు డాక్టరుగారు. ''యెలాగైనా ఆయన్ని వెతికిపట్టుకుందాం.''

నొప్పిడాక్టరు ఆ కుర్రాణ్ణి తోపుడులాగుడు వీపుమీద కూర్చోబెట్టి, సముద్రపు యిసక ఒడ్డుమీద యెంతో తిప్పాడు.






# గద్దలు

కాని పెంటాకి విచారంగానే వుంది. తోపుదులాగుడుమీద యెక్కి తిరిగినా హుషారుగా లేదు. ఆఖరికి డాక్టరుగారిని అడిగాడు:

''మా నాన్న దొరుకుతాడా మీకు?'' అని.

''నేను గద్దల్ని అడుగుతాను. వాటి చూపు మంచిది. చాలా దూరంలో వున్న వస్తువులు కూడా వాటికి కనిపిస్తాయి. అవి మేఘాలకింద యెగిరేటప్పుడు నేలమీద పాకే పురుగుని కూడా చూడగలవు. అన్ని ప్రాంతాల్లోనూ, అడవుల్లోనూ, పొలాల్లోనూ, కొండల్లోనూ, నగరాల్లోనూ, గ్రామాల్లోనూ వెతకమంటాను. మీ నాన్న కోసం వెతుకుతాయి'' అన్నాడు డాక్టరుగారు.



''మీరెంత తెలివైన వారండీ. మీ వూహ బాగుంది. కొంచెం ఆ గద్దల్ని పిలవరూ?'' అన్నాడు పెంటా.

డాక్టరుగారు గద్దల్ని పిలిచాడు. అవి వచ్చాయి.

''నమస్కారం డాక్టరుగారూ. మా వల్ల మీకు యేం పని కావాలి?''

''నాలుగు వేపులకీ వెళ్లి పొడుగాటి గడ్డం ఎర్రటి జుట్టు వున్న బెస్త వాడున్నాడేమో వెతకండి'' అన్నాడు డాక్టరుగారు.

''సరే'' అన్నాయి గద్దలు. ''మా ప్రియమైన డాక్టరుగారి కోసం మేం చెయ్యగలిగినదంతా చేస్తాం. మేం యెత్తుగా ఎగిరివెళ్లి సమస్త దేశాల్నీ, అన్ని అడవుల్నీ పొలాల్నీ, పర్వతాల్నీ, నగరాల్నీ గ్రామాల్నీ గాలిస్తాం. మీ బెస్తవాణ్ణి పట్టుకుంటాం'' అన్నాయి.

అవి అన్ని వేపులా యెగిరివెళ్లాయి. అడవులపైన, పొలాలపైన, కొండలపైన యెంతో యెత్తులో వెళ్లాయి. పొడుగాటి గడ్డం, ఎర్రని జుట్టు వున్న మత్స్యకారుడి కోసం ప్రతి గద్ద కళ్లు చిల్లులు పడేట్టు వెతికింది.

ఆ మర్నాడు అవి డాక్టరుగారి దగ్గరికి వెళ్లి అన్నాయి:

''మేం మొత్తం నేల అంతా గాలించేశాం. కాని బెస్తవాడు కనిపించలేదు. అంచేత అతను భూమ్మీద లేడన్న మాట!''





# కుక్క అవ్వా మత్స్యకారుడి కోసం వెతకడం

''మనం యేం చేద్దాం?'' అని బాతు కికా అడిగింది. ''మనం ఆరు నూరైనా నూరు ఆరైనా బెస్తవాని కోసం వెతకాల్సిందే. యేమంటే పెంటా అన్నం నీళ్ళూ ముట్టుకోవడం లేదు. అంత సేపూ యేడుస్తూనే వున్నాడు. తండ్రి కోసం బెంగ పడిపోయాడు'' అంది.

''యెలా పట్టుకుంటాం అతన్ని?'' అనడిగింది తోపుడులాగుడు. ''గద్దలు కూడా అతన్ని కనిపెట్టలేకపోయాయి, అంటే యిక యెవళ్ళూ కనిపెట్టలేరన్న మాట!''

''నువ్వు పొరపాటు పడ్డావు'' అంది అవ్వా. ''గద్దలు నిజంగా తెలివైన పక్షులే. వాటి చూపు అద్భుతమైందే. కాని మనిషి కోసం నిజంగా కుక్కలే వెతగ్గలవు. యెవరేనా మనిషి కావాలంటే కుక్కని అడగండి, ఖాయంగా దొరుకుతాడు.''

''గద్దల మనసు యెందుకు కష్టపెడతావు?'' అనడిగింది గుర్రుగుర్రు. ''మొత్తం నేలమీద అంతా యెగరడం పర్వతాలమీద, అడవుల్లో, పొలాల్లో వెతకడం వాటికి ఒక రోజులో అవుతుందా? నువ్వు యేం చెయ్యకుండా యిసకలో పడి పొర్లుతావు, అవి వెతుకుతూ కష్టపడుతున్నాయి. గద్దలు కాళీగా లేవు కదా.''

''నేను యేం చెయ్యకుండా పొర్లుతున్నానంటావా? ఎన్ని గుండెలు!'' అంది అవ్వా కోపంతో. ''నేను తలుచుకుంటే బెస్తవాణ్ణి మూ్డ్రోజుల్లో పట్టేస్తాను తెలుసా?'' అంది.

''తలుచుకోవాలట!'' అంది గుర్రుగుర్రు. ''అయితే తలుచుకో. నువ్వు వొట్టి బడాయి కొడుతున్నావంతే. నువ్వతన్ని పట్టలేవు'' అని నవ్వింది.

''అయితే నన్ను బడాయి కోరంటావా?'' అని అవ్వా కోపంగా అరిచింది. ''సరే అయితే చూద్దువు గాని'' అంటూ అవ్వా డాక్టరుగారి దగ్గరికి పరిగెత్తి వెళ్లింది.

''డాక్టరుగారూ, వాళ్ల నాన్న చేత్తో పట్టుకున్నదేమైనా వుంటే నాకిమ్మని పెంటాతో చెప్పండి'' అంది.

డాక్టరుగారు పెంటా దగ్గరికి వెళ్లి

''మీ నాన్న తన చేత్తో పట్టుకున్నదేదేనా నీ దగ్గర వుందా?'' అనడిగాడు.

''యిదిగో తీసుకోండి'' అంటూ, ఆ కుర్రాడు జేబులోనుంచి పెద్ద ఎర్ర రుమాలు తీసి యిచ్చాడు.

ఆ కుక్క రుమాలు దగ్గరికెళ్లి దాన్ని గట్టిగా వాసన చూడ్డం మొదలెట్టింది.

''యిది ఉప్పు చేప వాసనా, పొగాకు వాసనా కొడుతోంది. వీళ్ల నాన్న పైపు కాలుస్తూ వుండేవాడు, మంచి డచ్ చేపల్ని తినేవాడు. మరింకేం అక్కర్లేదు నాకు.... డాక్టరుగారూ ఆ కుర్రాడికి చెప్పండి. మహా అయితే మూర్డోజులు, వాళ్ల నాన్నని పట్టేస్తాను. యిదిగో ఆ పెద్ద పర్వతం దగ్గరకి పరిగెత్తిపోతున్నా'' అంది.

''కాని అప్పుడే చీకటి పడిపోయింది. నువ్వతన్ని చీకట్లో కనిపెట్టలేవు'' అన్నాడు డాక్టరుగారు.

''ఫరవాలేదు'' అంది కుక్క. ''నాకతని వాసన తెలుసు. మరేం అక్కర్లేదు. నాకు చీకట్లో కూడా వాసన బాగా తెలుస్తుంది.''

కుక్క ఎత్తైన పర్వతం దగ్గరికి పరిగెత్తిపోయింది.

''యివాళ ఉత్తరం వేపునుంచి గాలి వీస్తోంది. యిది యేం వాసన తెస్తోందో చూద్దాం. మంచు.... తడిసిన ఓవర్‌కోటు.... తడిసిన శీతకట్టు కోటు మరొకటి.... తోడేళ్లు.... సీలు జంతువులు.... తోడేలు పిల్లలు.... నెగడు పొగ.... బర్చ్ చెట్టు....''

''అన్ని వాసనలూ ఒక్క గాలి విసురులో నీకు నిజంగా తెలుస్తున్నాయా'' అని డాక్టరుగారు అడిగాడు.

''ఆఁ! నిజంగా'' అంది అవ్వా. ''ప్రతి కుక్కకీ ఘ్రాణశక్తి గాఢంగా వుంటుంది. మీరెన్నడూ గమనించని ఆ వాసనల్ని యే కుక్కపిల్లయినా పట్టగలదు'' అంది.

కుక్క మళ్లీ వాసన చూడ్డం మొదలెట్టింది. చాలా సేపు అవ్వా నిశ్శబ్దంగా వుండిపోయి, ఆఖరికి అంది:

''ధృవ ప్రాంతపు ఎలుగు బంట్లు.... జింకలు.... అడివిలో చిన్న పుట్టగొడుగులు.... మంచు.... మంచు.... వూఁ యింకా.... యింకా....''

''యేమిటి? తేనె పట్లా?'' అనడిగింది తోపుడులాగుడు.

''వుహుఁ, తేనె పట్లు కాదు'' అంది అవ్వా.

''యేవైనా కాయలా?'' అనడిగింది కికా.

''వుహుఁ, కాదు'' అంది అవ్వా.

''ఆపిల్ పళ్లా'' అనడిగింది గుర్రుగుర్రు.

''వుహు, కాదు, ఆపిల్స్ కాదు. కాయలు కాదు. తేనె తుట్లు కాదు. ఆపిల్స్ కాదు. ఫర్ చెట్ల కూచులు. అంటే మన బెస్తవాడు ఉత్తరం దిక్కున లేడన్నమాట. దక్షిణం వేపునుంచి వచ్చే గాలి చూద్దాం.''



''నిన్ను నమ్మను'' అంది గుర్రుగుర్రు. ''యిదంతా నీ కల్పన. నీకే వాసనలూ తెలీవు. యిదంతా వూరికే చెత్త'' అంది.

''నా జోలికి రాకు'' అని అవ్వా అరిచింది. ''లేకపోతే నిన్ను కరిచేస్తాను'' అంది.

''అబ్బ ఆగండి. దెబ్బ లాడుకోకండి. నీ ఘ్రాణశక్తి అద్భుతమైందని నాకనిపిస్తోంది అవ్వా. సరే, గాలి మారడం కోసం చూద్దాం. యింటికి పోయేవేళ అయిందిప్పుడు. త్వరపడండి! చూడండి, పెంటా వణికి పోతున్నాడు, యేదుస్తున్నాడు. బాగా చలి తగిలిందతనికి. అతనికి తిండానికేదేనా పెట్టాలి. తోపుడులాగుడు, నీ వీపుమీద తీసికెళ్ళు. పెంటా తోపుడులాగుడు వీపెక్కు. అవ్వా, కికా! మాతో రండి!'' అన్నాడు డాక్టరుగారు.





## మత్స్యకారుడి కోసం అవ్వా యింకా వెతకడం

మర్నాడు ఉదయం, బాగా పెందరాళే మళ్లీ అవ్వా ఎత్తు పర్వతం దగ్గరికి పరిగెత్తివెళ్లి దక్షిణం వేపునుంచి వచ్చే గాలిని వాసన చూడ్డం మొదలెట్టింది. చాలా సేపు వాసన చూసి ఆఖరికి అంది:

''చిలకల వాసన వేస్తోంది. ఖర్జూరం చెట్లు, కోతులు, గులాబీలు, ద్రాక్షలు, బల్లులు వున్న వాసన వస్తోంది. కాని బెస్తవాని వాసన రావడం లేదు.''

''యింకో సారి వాసన చూడు'' అంది బుంబా.

''నాకు జిరాఫీల వాసనా, తాబేళ్లూ, ఉ(ష్ట్రపకులూ, వేడి యిసకా, పిరమిడ్లూ వున్న వాసనా వస్తోంది. కాని బెస్తవాని వాసన రావడం లేదు.''

''నువ్వు బెస్తవాణ్ణి యెన్నటికీ పట్టలేవు'' అంది గుర్రుగుర్రు నవ్వుతూ. ''నువ్వు బడాయి పోకుండా వుండాల్సింది.''

అవ్వా యేం అనలేదు. మర్నాటి ఉదయం మళ్ళీ ఎత్తు పర్వతం పైకి పరిగెత్తుకెళ్ళి సాయంత్రం బాగా పొద్దుపోయే దాకా వాసనా చూస్తూనే వుంది. రాత్రి పొద్దుపోయాక అవ్వా డాక్టరుగారి దగ్గరికి వచ్చింది. ఆయనా, పెంటా అప్పటికే నిద్రపోతున్నారు.

''డాక్టరుగారూ, లేవండి, లేవండి!'' అని అరిచింది. ''లేవండి. బెస్తవాడు దొరికాడు! లేవండి! నిద్ర చాలు. వినిపిస్తోందా? బెస్త అతను యెక్కడున్నదీ కని పెట్టాను. అవును, గాలిలో పొగాకు వాసనా వచ్చింది, చేప వాసనా వచ్చింది.''

డాక్టరుగారు లేచి కుక్క వెనక్కాల వెళ్ళాడు.

''సముద్రం ఆవలినుంచి పడమటి గాలి వీస్తోంది. నాకు బెస్త ఆయన వాసన వచ్చింది. ఆయన సముద్రం అవతల, ఆవలి ఒడ్డున వున్నాడు. అక్కడికి తొందరగా వెడదాం పదండి.''

అవ్వా గట్టిగా మొరిగింది, దాంతోటి అన్ని జంతువులూ ఎత్తు పర్వతం పైకి హుటాహుటీ వెళ్ళిపోయాయి. వాటన్నిటికీ ముందున్నాడు పెంటా.

''నావికుడు రాబిన్‌సన్ దగ్గరికి తొందరగా వెళ్లండి'' అని అవ్వా డాక్టరుగారి కేసి చూసి అరిచింది. ''అతని ఓడని తెండి. గబగబా! ఆలస్యం అయిపోవచ్చు మనకి!'' అంది.

డాక్టరుగారు రాబిన్‌సన్ ఓడ లంగరు దించిన చోటుకి హడావుడిగా వెళ్ళాడు.

''ఓయ్ రాబిన్‌సన్'' అని పిలిచాడు డాక్టరుగారు. ''దయచేసి నీ ఓడ ఓ సారి య్యి. ఓ ముఖ్యమైన పని పడింది. నేను మళ్ళీ సముద్రంమీద ప్రయాణం చెయ్యాల్సి వచ్చింది'' అన్నాడు.



''తప్పకుండా తీసుకెళ్తా'' అన్నాడు నావికుడు రాబిన్‌సన్. ''కాని సముద్రపు దొంగలనుంచి జాగ్రత్తగా వుండు. వాళ్ళు పరమ దుర్మార్గులు, గజదొంగలు. నిన్ను బందిగా పట్టేస్తారు. నా ఓడని కాల్చేయనేనా కాల్చేస్తారు లేకపోతే ముంచేస్తారు.''

కాని డాక్టరుగారు అతన్ని పూర్తిచెయ్య నివ్వలేదు. ఓడమీదకి పరిగెత్తివెళ్ళి, పెంటానీ, జంతువులన్నిటినీ తీసుకుని సముద్రంమీద ప్రయాణం అయివెళ్ళిపోయాడు.

అవ్వా ఓడపైకి పరిగెత్తి డాక్టరుగారిని చూసి చెప్పింది:

''జక్సారా! జక్సారా! క్సూ!''

అంటే జంతువుల భాషలో

''నా ముక్కు కేసి చూడండి! నా ముక్కు కేసి! నా ముక్కు యెటు చూపిస్తుందో అటు ఓడ తిప్పండి.''

డాక్టరుగారు యింకా యెక్కువ తెరచాపలు పెట్టి యింకా యెక్కువ వేగంగా ఓడని పోనిచ్చాడు.

''వ్వూ, గబగబా! యింకా వేగంగా'' అని అవ్వా అరిచింది.

జంతువులు ఓడ పైన నుంచున్నాయి. మత్స్యకారుడు కనిపిస్తాడేమోనని అలా చూస్తూ వున్నాయి.

వాళ్ల నాన్న కనిపిస్తాడని పెంటాకి నమ్మకం కలగలేదు. తల వాలేసుకుని యేడుపు లంకించుకున్నాడు.

సాయంత్రం అయింది. తర్వాత చీకటి పడింది. బాతు కికా కుక్కతోటి అంది:

''అవ్వా, నువ్వు బెస్తవాణ్ణి కనిపెట్టలేవు. నువ్వంటే జాలేస్తోంది పాపం పెంటా. కాని చేసేదేం లేదు. యింటికి పోదాం పదండి.''

డాక్టరుగారి కేసి తిరిగి

''డాక్టరుగారూ, ఓడని వెనక్కి తిప్పండి. మనకా బెస్తవాడు యిక్కడ దొరకడు'' అంది కికా.

ఓడ పై కొయ్యమీద కూర్చుని, ముందుకి చూస్తూ వున్న గుడ్లగూబ బుంబా వున్నట్టుండి

''అదుగో యెదర పెద్ద గుట్ట కనిపిస్తోంది, అక్కడ యిక్కడికి చాలా దూరంలో'' అంది.

''తొందర తొందరగా అక్కడికి పోదాం'' అని అవ్వా అరిచింది. ''బెస్తాయన అక్కడున్నాడు, ఆ గుట్టమీద! నాకు వాసనేస్తోంది. ఆయనక్కడే వుండి వుండాలి!'' అంది.

కొంచెం సేపట్లోనే సముద్రంలోనుంచి ఓ గుట్ట యెత్తుగా వుండడం వాళ్లకి కనిపించింది. డాక్టరుగారు ఓడని తిన్నగా ఆ గుట్ట దగ్గరికి తీసికెళ్లాడు.

కాని మత్స్యకారుడు కనిపించలేదు.

''నీకు బెస్తాయన కనిపించడని నే చెప్పానా అవ్వా'' అంది గుర్రుగుర్రు నవ్వుతూ. ''డాక్టరుగారు నీ లాంటి బడాయి కోరుని యెందుకు నమ్ముతున్నారో నాకర్థం కాదు'' అంది.

డాక్టరుగారు గుట్ట పైకి గబగబా వెళ్లి మత్స్యకారుణ్ణి పిలిచాడు. కాని జవాబు రాలేదు.

''జిన్... జిన్...'' అని బుంబా, కికాలు అరిచాయి.

జంతువుల భాషలో ''జిన్, జిన్'' అంటే ''హేయ్'' అని అర్థం.

కాని అలల మీదుగా గాలి మాత్రం దూసుకు వచ్చి భీకరమైన శబ్దంతో రాళ్లమీద ప్రతిధ్వనించింది.





## అవ్వా మత్స్యకారుణ్ణి కనిపెట్టడం

మత్స్యకారుడు గుట్టమీద లేడు. అవ్వా ఓడమీదనుంచి గుట్టమీదకి యెగిరి, అన్ని చోట్లా వాసన చూస్తూ అటూ యిటూ పరిగెత్తింది. వున్నట్టుండి అది గట్టిగా మొరిగింది.

''కినెడెలె! నావ్!'' అని అవ్వా అరిచింది. ''కినెడెలె! నావ్!''

అంటే జంతువుల భాషలో

''నా వెనకే రండి, డాక్టరుగారూ గబగబా!'' అని అర్థం.

డాక్టరుగారు కుక్క వెనక్కాల పరిగెత్తాడు.

ఆ గుట్ట పక్క చిన్న ద్వీపం వుంది. అవ్వా అక్కడికి పరిగెత్తింది. డాక్టరు గారు వెనక్కాలే వెళ్లాడు. అవ్వా అటూ యిటూ పరిగెత్తి, హఠాత్తుగా నేలలోని ఓ గుంతలోకి దూకింది. ఆ గుంతలో చీకటిగా వుంది. డాక్టరు లోపలికి వెళ్లి లాంతరు వెలిగించాడు. అక్కడేం కనిపించిందని? ఆ గుంతలో నేలమీద ఎర్ర తల మనిషొకతను సాష్టాంగ పడి వున్నాడు. బాగా చిక్కిపోయి, పాలిపోయి వున్నాడు.



అతను పెంటా తండ్రి.

నొప్పిడాక్టరు అతని చొక్కా చేతులు గుంజి ''లేవండి, మీ కోసమే మేము యెంతో వెతుకుతున్నాం! మీ కోసం బెంగ పడ్డాం'' అన్నాడు.

అతను డాక్టరుగారిని సముద్రపు దొంగేమో ననుకుని, పిడికిలి బిగించి అన్నాడు:

''నా దగ్గరనుంచి ఫో, గజదొంగా! నా కొనప్రాణం పోయే దాకా నన్ను నేను రక్షించుకోగలను.''

కాని అంతలోకీ డాక్టరుగారి సౌమ్య వదనం చూసి ''మీరు సముద్రపు దొంగ కారు అనిపిస్తోంది. నాకు కొంచెం తిండాని కేదేనా యివ్వండి. నేను ఆకలితో చచ్చి పోతున్నాను'' అన్నాడు.

డాక్టరుగారు అతనికి కొంచెం రొట్టె, జున్ను యిచ్చాడు. అతను మొత్తం పిసరు కూడా మిగల్చకుండా తినేసి, కాళ్లమీద నిలబడ్డాడు.

''యిక్కడికెలా వచ్చారు?'' అని డాక్టరుగారు అడిగాడు.

''దుర్మార్గులైన సముద్రపు దొంగలు నన్నిక్కడ పడేశారు. వాళ్లు రక్త దాహం వున్నవాళ్లు, దుర్మార్గులు. వాళ్లు నాకు తిండానికి, తాగడానికి యేం యివ్వ లేదు. నా ముద్దుల కొడుకుని తీసుకుపోయారు, యెక్కడికో తెలీని చోటికి. మా బాబు యెక్కడున్నాడో తెలుసా?''

''అతని పేరేమిటి?'' అని డాక్టరుగారు అడిగాడు.

''పెంటా'' అని అతను జవాబు చెప్పాడు.

''నాతో రండి'' అన్నాడు డాక్టరుగారు. ఆ మత్స్యకారుడు గుంతలోనుంచి యివతలికి రావడానికి సాయం చేశాడు.

అవ్వా వాళ్ల ముందు పరిగెత్తింది.

ఓడ మీదనుంచే పెంటా చూశాడు వాళ్ల నాన్న వస్తున్నట్టు. అతని కేసి పరిగెత్తి వెళ్ళాడు.

''హాయ్‌హాయ్! మా నాన్న దొరికాడు'' అని అరిచాడు.

ప్రతి జంతువూ చప్పట్లు చరుస్తూ నవ్వడం మొదలెట్టింది.

''కీర్తి అంటే నీదే, అవ్వా,
నీలాంటి కుక్క భూమ్మీద లేదు!''

అన్నాయి.

చిన్న పంది గుర్రుగుర్రు మాత్రం ముటముట లాడుతూ ఓ పక్క నుంచుంది.

''అవ్వా! నిన్ను చూసి నవ్వి నిన్ను బడాయికోరు అన్నందుకు నన్ను మన్నించు'' అంది.

''దాన్దేముందిలే, అలాగే క్షమిస్తాను. కాని యింకో సారి నన్ను కష్టపెట్టావో నీ తోక కొరికేస్తాను'' అంది.

నొప్పిడాక్టరు ఎర్ర తల మత్స్యకారుణ్ణీ అతని కొడుకునీ వాళ్ళుండే వూరికి, వాళ్ల యింటికి తీసికెళ్ళాడు.

ఓడ ఒడ్డుకి వచ్చే ముందు వాళ్లకి ఓ ఆడమనిషి కనిపించింది. ఆమె పెంటా తల్లి. యిరవై రోజులుగా ఆమె రాత్రింబగళ్లు సముద్రం కేసి చూస్తూ, భర్తా కొడుకూ తిరిగివస్తారని యెదురు చూస్తూ నుంచుంది.

పెంటాని చూడగానే వాడి దగ్గరికి పరిగెత్తి వెళ్లిపోయి, ముద్దులాడింది.

ఆమె పెంటాని ముద్దుపెట్టుకుంది, ఎర్ర తల మత్స్యకారుణ్ణి ముద్దు పెట్టుకుంది. డాక్టరుగారికి నమస్కరించింది. ఆమె కుక్క అవ్వాకి కృతజ్ఞత చెప్పి, దాన్నీ ముద్దుపెట్టుకుందా మనుకుంది.



కాని అవ్వా పొదలోకి పరిగెత్తిపోయి గొణిగింది:

''నాకు ముద్దులంటే అసహ్యం, వెధవ పని! ఆమె యెవళ్లనేనా ముద్దు పెట్టుకో దలిస్తే గు(రుగు(రుని ముద్దుపెట్టుకోమనండి.''

అవ్వా పైపైకి కోపంగా వున్నట్టు నటించిందంతే. నిజానికి దానికి సంతోషంగానే వుంది.

సాయం(త్రం డాక్టరుగారన్నాడు:

''సరే, సెలవు. యింటికి తిరిగివెళ్లే వేళయింది మాకు'' అని.

''అబ్బెబ్బే వీల్లేదు. మీరిక్కడ కొంత కాలం మా అతిధులుగా వుండాలి!'' అంది మత్స్యకారుడి భార్య. ''మేం చేపల్ని పడతాం. అప్పచ్చులు చేస్తాం. తోపుదు లాగుడికి తేనే తుట్టెల్ని యిస్తాం'' అంది.

''నేను సంతోషంగా యిక్కడ యింకొక రోజు వుంటాను'' అంది తోపుదు లాగుదు రెండు నోళ్లతోటీ నవ్వుతూ.

''నేనూను'' అంది కికా.

''అలాగే నేను కూడా'' అంది బుంబా.

''సరే అయితే. నేనూ అందరితోబాటూ వుంటా'' అన్నాడు డాక్టరుగారు. ఆయన, జంతువులన్నీ వెంట రాగా మత్స్యకారుడి యింటికి వెళ్లాడు.





## అవ్వాకి బహుమతీ రావడం

డాక్టరుగారు తోపుదులాగుడు వీపెక్కి వూళ్లోకి వచ్చారు. ఆయన ముఖ్య వీధి గుండా వెళ్లేటప్పుడు గ్రామస్థులందరూ ఆయనకి అభివాదం చేసి

''జాలిగుండె డాక్టరుగారు చిరకాలం వర్ధిల్లాలి!'' అని అరిచారు.

చౌకులో స్థానిక పాఠశాల పిల్లలు ఆయన్ని కలుసుకుని చక్కటి పువ్వుల గుత్తిని ఆయనకి బహుకరించారు.

అప్పుడొక మరుగుజ్జు ఆయన దగ్గర కొచ్చి

''మీ కుక్క అవ్వాని చూద్దామని వుంది నాకు'' అన్నాడు.

ఆ మరుగుజ్జు పేరు బంబుకో. ఆ వూళ్లోకల్లా వృద్ధుడైన గొర్రెలకాపరి అతనే. వూళ్లోవాళ్లందరూ అతన్ని గౌరవంగా చూస్తారు, అభిమానిస్తారు.

అవ్వా అతని దగ్గరికి పరిగెత్తివెళ్లి తోక ఆడించింది.

బంబుకో జేబులోనుంచి యెంతో ముచ్చటగా వున్న కుక్క తోలుపటకా తీశాడు.

''గౌరవనీయమైన అవ్వా, సముద్రపు దొంగలు యెత్తుకు పోయిన బెస్త వాణ్ణి కనిపెట్టినందుకు యీ ముచ్చటైన తోలుపటకాని నీకు కానుకగా మా గ్రామ వాసులం యిస్తున్నాం'' అన్నాడు.

అవ్వా తోక ఆడించి ''చాకా'' అంది.

మీకు గుర్తుండే వుండాలి, జంతు భాషలో అలా అంటే ''థాంక్స్'' అని అర్థం.

మనుషులందరూ కుక్క తోలుపటకాని చూశారు. పెద్దపెద్ద అక్షరాలతో యిలా రాసి వుంది:

''యెంతో తెలివీ, జాలీ, ధైర్యంగల కుక్క అవ్వాకి''

నొప్పిడాక్టరు మూడ్రోజులు పెంటా తల్లిదండ్రుల్తో గడిపారు. చాలా సరదాగా గడిచింది. అన్ని రోజులూ తోపుడులాగుడు తియ్యని తేనెపట్లు తింటూనే వుంది. పెంటా ఫిడేలు వాయించాడు. గుర్రుగుర్రు, బుంబాలు నాట్యం చేశాయి. కాని యింటికి వెళ్లే సమయం అయింది.

''సెలవ్'' అన్నాడు డాక్టరుగారు మత్స్యకారుడితోటీ, అతని భార్యతోటీ. తోపుడులాగుడు వీపెక్కి ఓడ దగ్గరికి వెళ్లిపోయాడు.

మొత్తం గ్రామం అంతా ఆయనకి వీడ్కోలు చెప్పారు.

''మీరు మాతో వుండిపోతే మంచిది'' అన్నాడు మరుగుజ్జు బంబుకో.

''సముద్రపు దొంగలు సముద్రంమీద తిరుగుతున్నారు. వాళ్లు మీమీద దాడి చేస్తారు. మిమ్మల్నీ మీ జంతువుల్నీ బందీలుగా పట్టుకుంటారు.''

''నాకు సముద్రపు దొంగలంటే భయం లేదు. మా ఓడ చాలా వేగంగా పోతుంది. మేం అన్ని తెరచాపల్నీ విడుస్తాం. దొంగలు మాతో అందుకోలేరు'' అన్నాడు డాక్టరుగారు.

యీ మాటలని డాక్టరుగారు సముద్రంమీద ప్రయాణం అయివెళ్లిపోయాడు. వూళ్లో వాళ్లందరూ రుమాళ్లు వూపి ''భేష్'' అంటూ వీడ్కోలు చెప్పారు.






# సముద్రపు దొంగలు

డాక్టరుగారి ఓడ అలలమీద వేగంగా పోతోంది. మూడవ రోజున వాళ్లకి ఒక ద్వీపం కనిపించింది. చెట్లుగాని, మనుషులుగాని, జంతువులుగాని యేమీ లేవక్కడ. వూరికే యిసక, పెద్ద రాళ్ళూ వున్నాయంతే. కాని వాటి వెనకాల భయంకరమైన సముద్రపు దొంగలు దాంకున్నారు. యేదేనా ఓడ ద్వీపం దగ్గరికి వస్తే, వాళ్లు దానిమీద దాడి చేసి, కొల్లగొట్టి, మనుషుల్ని చంపేసి ఆఖరికి ఓడని ముంచేస్తారు. డాక్టరుగారంటే ఆ దొంగలకి చాలా కోపంగా వుంది. ఆయన ఎర్ర తల మత్స్యకారుణ్ణీ అతని కొడుకు పెంటానీ విడిపించాడు కదా. వాళ్లు చాలా రోజులుగా డాక్టరుగారి కోసం పొంచి వున్నారు.

వాళ్లకి పెద్ద ఓడ వుంది. దాన్ని ఓ పెద్ద బండరాయి వెనక దాచిపెట్టారు.

డాక్టరుగారు సముద్రపు దొంగల్ని కాని, వాళ్ల ఓడని కాని చూళ్లేదు. ఆయన తన జంతువుల తోటి ఓడపైన పచార్లు చేస్తున్నాడు. వాతావరణం బ్రహ్మాండంగా వుంది, మంచి యెండ కాస్తోంది. డాక్టరుగారు చాలా సంతోషంగా వున్నాడు. వున్నట్టుండి చిన్న పంది గుర్రుగుర్రు అంది:

''చూడండి యెలాంటి ఓడ కనిపిస్తోందో అక్కడ?''

డాక్టరుగారు చూశాడు. నల్లగా మసి బొగ్గులాంటి తెర చాపలతో వుంది ఓడ.

ద్వీపం వెనకాలనుంచి వాళ్ల కేసే వస్తోంది. నల్లగా, సిరాలా వుంది.



''దాని తెరచాపలు నాకు కిట్టవు. అవి తెల్లగా కాకుండా నల్లగా యెందు కున్నాయి? సముద్రపు దొంగల ఓడలకే నల్ల తెరచాపలుంటాయి'' అంది చిన్న పంది గుర్రుగుర్రు.

గుర్రుగుర్రు వూహ నిజమే. దుర్మార్గులైన సముద్రపు దొంగలు నల్లని తెరచాపల మాటున తమని వెంబడిస్తున్నారు. వాళ్ల డాక్టరుగారిని పట్టుకుని క్రూరంగా కసి తీర్చుకోవాలనుకున్నారు. మరి ఆయన మత్స్యకారుణ్ణీ, పెంటానీ తమనుంచి విడిపించాడు కదా.

''వూఁ గబగబా! అన్ని తెరచాపల్ని యెత్తండి'' అని అరిచాడు డాక్టరుగారు.

కాని సముద్రపు దొంగలు దగ్గర పడుతున్నారు.

''వాళ్ల మనల్ని అందుకుంటారేమో! చాలా దగ్గరకి వచ్చేశారు. వాళ్ల భయంకరమైన ముఖాలు కనిపిస్తున్నాయి. వాళ్ల కళ్ల యేం దుర్మార్గంగా వున్నాయి! మనం యేం చెద్దాం? యెక్కడికి పారిపోగలం? వాళ్లిప్పుడు మనల్ని పట్టుకుని సముద్రంలోకి తోసేస్తారు'' అని అరిచింది కికా.

అవ్వా అడిగింది:

''ఓడ వెనకతట్టుమీద నుంచున్న మనిషి కనిపిస్తున్నాడా? అతన్ని గుర్తుపట్టలా? వాడే దుర్మార్గుడు బార్మలేయ్. ఓ చేతిలో కత్తి పట్టుకున్నాడు, యింకో చేతిలో పిస్టల్ పట్టుకున్నాడు. మనల్ని కాల్చెయ్యాలను కుంటున్నాడు, మనల్ని నాశనం చెయ్యడానికి!''

కాని డాక్టరుగారు నవ్వి, అన్నాడు:

''యేం బెంగ పడకండర్రా. అతను నెగ్గలేదు. నాకో మంచి పథకం వుంది. అలలమీద యెగిరే స్వాలో పిట్ట కనిపిస్తోందా? యీ దొంగలబారినుంచి పారిపోడానికి

అది మనకి సాయపడుతుంది.'' ఆయన బిగ్గరగా ''న – జ – సె! న – జ – సె! కరాచుయ్, కరాబున్'' అని అరిచాడు.

జంతువుల భాషలో

''ప్రియమైన స్వాలో, ఆ సముద్రపు దొంగలు మా వెంటబడ్డారు. వాళ్లు మమ్మల్ని చంపెయ్యాలను కుంటున్నారు, సముద్రంలోకి తోసెయ్యాలను కుంటున్నారు'' అని అర్థం.

స్వాలో ఓడమీద వాలింది.

''విను స్వాలో, నువ్వు మాకు సాయం చెయ్యాలి'' అన్నాడు డాక్టరుగారు. ''కరాఫూ, మరాఫూ, డూక్.''

అంటే ''గబగబా ఎగిరివెళ్లి కొంగల్ని పిలు'' అని జంతు భాషలో అర్థం.

స్వాలో ఎగిరివెళ్లిపోయి, ఓ క్షణంలో కొంగలతో కలిసి తిరిగివచ్చింది.

''నమస్కారం డాక్టరుగారూ! విచారించకండి, మేం మీకు సాయం చేస్తాం'' అన్నాయి.

డాక్టరుగారు ఓడ ముఖభాగంలో ఒక తాడు కట్టాడు. కొంగలు చాలా వున్నాయి. ఆ తాటిని పట్టుకుని అవి ఓడని చాలా వేగంగా ముందుకు లాగాయి.

ఓడ బాణంలా దూసుకుపోతోంది. డాక్టరుగారైతే టోపీ యెగిరిపోకుండా వుండడం కోసమన్నెప్పి గట్టిగా పట్టుకోవాల్సి వచ్చింది.

జంతువులు వెనక్కి చూశాయి. సముద్ర దొంగల నల్ల తెరచాపల ఓడ చాలా వెనక బడిపోయింది.

‘‘కృతజ్ఞులం కొంగల్లారా. మీ పుణ్యమా అని ఆ దొంగల బారినుంచి బయటపడ్డాం. మీరు లేకపోయినట్లయితే సముద్రం అడుగున వుండే వాళ్లం మేం’’ అన్నాడు డాక్టరుగారు.






## ఎలకలు ఓడని యెందుకు వదిలిపెట్టాయి?

ఆ భారమైన ఓడని లాగడం కొంగలకి కష్టం అయింది. కొన్ని గంటల్లోనే అవి అలిసిపోయి, దాదాపు సముద్రంలో పడినంత పనైంది. అప్పుడవి ఆ ఓడని ఒడ్డు దగ్గరకి లాగాయి. డాక్టరుగారి దగ్గర సెలవు తీసుకున్నాయి. తమ బాడవకి యెగిరిపోయాయి.

యిప్పుడు గుడ్లగూబ బుంబా డాక్టరుగారి దగ్గరికి వచ్చి అంది:

''అదుగో చూడండి! ఓడ పైన ఎలకలున్నాయి. అవి తిన్నగా నీళ్లల్లోకి దూకి ఒక దాని తర్వాత ఒకటి ఒడ్డుకి యీదుకుంటూ పోతున్నాయి.''

''మంచిదే! ఎలకలు చెడ్డవి, క్రూరమైనవి. అవంటే నాకిష్టం వుండదు'' అన్నాడు డాక్టరుగారు.

''మీరు పొరబడ్డారు'' అంది బుంబా. ''అది తప్పు. ఎలకలు ఓడ అడుగున వుంటాయి. ఓడ మట్టుకి చిల్లు పడి నీళ్ల యెక్కేటప్పుడు, అవే అందరికంటే ముందు చూసి, నీళ్లల్లోకి దూకి ఒడ్డుకి యీదుకుపోతాయి! అంటే ఓడ మునిగి పోతుందని అర్థం. ఎలకలు యేం మాట్లాడుకుంటున్నాయో వినండి!''

ఆ సమయంలో రెండు ఎలకలు యివతలికి వచ్చాయి — ఓ ముసల్ది, ఓ పడుచుదీ. ముసలి యెలక పడుచు ఎలకతో అంది:

''రాత్రి నేను నా కన్నంలోకి తిరిగి వస్తూ వుంటే, ఓ బీటద్వారా నీళ్ల లోపలికి రావడం కనిపించింది. సరే, ఓడని వదిలి పెట్టాలి, యిది రేపు మునిగి పోతుంది అనుకున్నాను. యింకా అవకాశం వుండగానే నువ్వు ఓడని వదిలిపెట్టాలని నా అభిప్రాయం.''

అలా అని అవి రెండూ సముద్రంలోకి దూకాయి.

''అవునవును! నాకు గుర్తు వచ్చింది. ఓడ మునిగిపోయే ముందు ఎలకలు ఓడని వదిలేస్తాయి. మనం తక్షణం యీ ఓడని వదిలిపెట్టెయ్యాలి! లేకపోతే మనమూ దీంతోబాటు మునిగిపోతాం! జంతువుల్లారా! రండి! త్వరగా'' అన్నాడు డాక్టరుగారు.

ఆయన తన సామాను పోగుజేసుకుని గబగబా ఒడ్డుకి పరిగెత్తాడు. జంతువులు ఆయన వెంట వచ్చాయి. ఆయనా, అవీ చాలా సేపు యిసక ఒడ్డుమీద నడచిం తర్వాత, అలసట వచ్చింది.

''కాసేపు కూర్చుని విశ్రాంతి తీసుకుందాం. ఏం చెయ్యాలో ఆలోచిద్దాం'' అన్నాడు డాక్టరుగారు.

''యిక మన జీవితాంతం మనం యిక్కడే వుండిపోతామా?'' అంది తోపుదులాగుదు. అది యేడ్చింది.

దాని నాలుగు కళ్లనుంచీ పెద్ద పెద్ద కన్నీటి చుక్కలు కారాయి.

జంతువులన్నీ తోపుదులాగుదుతోబాటు కలిసి యేడవడం మొదలెట్టాయి, వాటన్నిటికీ యింటికి తిరిగివెళ్లిపోవాలనే వుంది.

అనుకోకుండా ఒక స్వాలో పక్షి వచ్చింది.

''డాక్టరుగారూ, డాక్టరుగారూ, పెద్ద అనర్థం సంభవించింది. సముద్రపు దొంగలు మీ ఓడని పట్టుకున్నారు'' అంది.

డాక్టరుగారు ఒక్క సారి ఎగిరి నుంచున్నాడు.

''మా ఓడమీద వాళ్లేం చేస్తున్నారు?'' అని అడిగాడు.

''వాళ్లు మీ ఓడని కొల్లగొట్టాలని చూస్తున్నారు. గబగబా అక్కడికి వెళ్లి వాళ్లని తరిమెయ్యండి'' అని చెప్పింది.

''వుహుఁ!'' అన్నాడు డాక్టరుగారు చిరునవ్వు నవ్వుతూ. ''వాళ్లని తరిమెయ్య కూడదు. వాళ్లని మా ఓడమీద ప్రయాణం చెయ్యనీ. వాళ్లు యెక్కువ దూరం వెళ్లలేరు. నువ్వు చూద్దువుగాని. పోదాం పదండి. వాళ్లు మనల్ని చూడక ముందే వాళ్ల ఓడని మన ఓడకి బదులుగా లాగేసుకుందాం. పోయి సముద్ర దొంగల ఓడ తీసుకుందాం.''

డాక్టరుగారు ఒడ్డమ్మటే పరిగెత్తివెళ్లాడు. తోపుదులాగుదు, మిగతా జంతువులూ వెనకే వెళ్లాయి.

తొందర్లోనే వాళ్లు సముద్ర దొంగల ఓడని చేరుకున్నారు.

ఎవళ్లూ ఓడమీద లేరు. అందరూ నొప్పిడాక్టరుగారి ఓడమీదకి పోయారు.

''హుష్'' అన్నాడు డాక్టరుగారు. ''సద్దు చెయ్యొద్దు, వాళ్ళు మనల్ని చూడకుండా మనం వాళ్ల ఓడ యెక్కుదాం.''






# ఒక దురదృష్టం తర్వాత యింకోటి

జంతువులు యేం చప్పుడు చెయ్యకుండా ఓడ యెక్కాయి. చడీచప్పుడూ కాకుండా నల్ల తెరచాపలు యెత్తాయి. సముద్రంమీద ప్రయాణం అయాయి. సముద్రపు దొంగలు యేమీ చూళ్లేదు.

యింతట్లోకీ పెద్ద దురదృష్టం సంభవించింది.

విషయం యేమంటే చిన్న పంది గుర్రుగుర్రుకి విపరీతమైన జలుబు చేసింది.

సముద్రపు దొంగల వైపునుండి పారిపోదామని డాక్టరుగారు అనుకొనే సమయానికే గుర్రుగుర్రు హాచ్‌హాచ్ మంటూ గట్టిగా తుమ్మడం మొదలెట్టింది.

ఎవళ్ళో తుమ్ముతూ వుండడం సముద్రపు దొంగలు విన్నారు. ఓడ పైతట్టుకి పరిగెత్తివెళ్ళి డాక్టరుగారు ఓడని తీసుకుపోతూ వుండడం చూశారు.

''ఆగండి! ఆగండి!'' అని సముద్రపు దొంగలు అరిచి, డాక్టరుగారి వెంట బడ్డారు.

డాక్టరుగారు అన్ని తెరచాపల్నీ యెత్తేశారు. సముద్రపు దొంగలు డాక్టరుగారిని పట్టేసుకుంటారేమోననే కొంచెం సేపు అనిపించింది. కాని ఆయన ఓడ వేగం అందుకుంది. దొంగల ఓడ వెనకబడి పోయింది.

''హమ్మయ్య! మనం బతికాం'' అని డాక్టరుగారు అరిచాడు.

కాని ఆ సమయంలో దుర్మార్గుడైన బార్మలేయ్ గురి చూసి పిస్టల్ కాల్చాడు. ఆ గుండు తోపుదులాగుడు ఛాతీమీద తగిలి, అది నీళ్ళల్లోకి పడిపోయింది.

''డాక్టరుగారూ! డాక్టరుగారూ! నన్ను రక్షించండి! మునిగిపోతున్నాను'' అని అరిచింది తోపుదులాగుడు.

''అయ్యో తోపుదులాగుడు! అలాగే పట్టుకో! నీకు సాయం చేస్తాం'' అన్నాడాయన.

డాక్టరుగారు ఓడని ఆపు చేసి ఒక తాటిని విసిరాడు.

తోపుదులాగుడు ఆ తాటిని పళ్ళతో పట్టుకుంది. డాక్టరుగారు గాయపడిన ఆ జంతువుని ఓడమీదకి లాగాడు. దానికి కట్టుకట్టి, మళ్ళీ ప్రయాణం సాగించాడు. కాని అప్పటికి మించిపోయింది. సముద్రపు దొంగలు చాలా దగ్గరకి వచ్చేశారు.

''ఆఖరికి మిమ్మల్ని పట్టాం'' అని వాళ్ళు అరిచారు. ''నిన్నూ నీ జంతువుల్నీ పట్టాం. నీ ఓడమీద పోతులా బలిసిన బాతు వున్నట్టుంది. చక్కగా వేపుడు కూర చేసుకుంటాం. ఆ చిన్న పందిని కూడా వేయించుకు తింటాం. చాలా కాలం

అయింది, యేం తినలేదు మేం. యీ రాత్రి పంది కండలు తింటాం. హా! హా! హా! అయ్యా, నువ్వూ, దరిద్రపుగొట్టు డాక్టరూ! నిన్ను సముద్రంలోకి తోసేస్తాం, వాడి కోరల షార్కులు భోంచేస్తాయి.''

గుర్రుగుర్రు యీ మాటలు విని యేడుపు లంకించుకుంది.

''అయ్యో! అయ్యో! యీ సముద్రపు దొంగలు నన్ను వేయించుకు తినేస్తార్ట! నా ఖర్మ!''

డాక్టరుగారిని చూసి జాలి పడి అవ్వా కూడా ఏడుపు లంకించుకుంది.

''ఆయన్ని షార్కు చేపలు మింగెయ్యడం నే చూళ్లేను'' అంది.






# డాక్టరుగారిని రక్షించడం

గుడ్లగూబ టుంబా మాత్రం సముద్రపు దొంగలంటే భయం పడలేదు. మెల్లిగా అవ్వాకీ, గుర్రుగుర్రుకీ చెప్పింది:

"మీరిద్దరూ బడుద్ధాయిలు. దేనికి భయం? సముద్రపు దొంగలున్న ఓడకి చిల్లు పడిందనీ, త్వరలో మునిగిపోతుందనీ మీకు తెలీదూ? ఎలక యేం చెప్పిందో వినలేదా? యివాళ ఆ ఓడ ఖాయంగా మునిగిపోతుందని చెప్పింది. అంచేత, భయ పడ్డం యెందుకూ అని! ఓడలోకి బాగా నీళ్లు యెక్కుతున్నాయి, బాగా నీళ్లు నిండి ఓడ ములుగొతుంది, వాళ్లూ మునిగిపోతారు. మనకే హానీ జరగదు" అంది.

కాని గుర్రుగుర్రు యేడుపు ఆపలేదు.

''సముద్రపు దొంగలు మునిగిపోయే లోపలే నన్నూ, కికానీ వేయించుకు తినడానికి వ్యవధి వుంటుంది వాళ్లకి'' అంది.

యీలోపున ఆ దొంగలు దగ్గర పడుతున్నారు. బార్మలేయ్ ముఖ్యుడైన దొంగ. అతను ముందు దూలం పైన నుంచున్నాడు. కత్తి ఝుళిపిస్తూ అరుస్తున్నాడు:

''కోతి డాక్టరూ! యిక ఆ కోతులకి నయం చెయ్యలేవు. తొందర్లోనే నిన్ను నీళ్లల్లోకి తోసేస్తాం. షార్కులు నిన్ను తినేస్తాయి.''

డాక్టరుగారు వాళ్ల కేసి అరిచాడు:

''బార్మలేయ్ జాగ్రత్త! షార్కు చేపలు నిన్నే మింగెయ్యగలవు! మీ ఓడ చిల్లు పడి సముద్రంలో మునిగిపోతుంది.''

''అబద్ధం ఆడుతున్నావ్'' అన్నాడు బార్మలేయ్. ''నా ఓడ మునిగిపోయేటట్టుంటే ఎలకలు దీన్ని వొదిలిపెట్టేసి వుండేవి'' అన్నాడు.

''ఎలకలు యెప్పుడో వొదిలేశాయి. తొందరలోనే నువ్వూ, నీ తోటి దొంగలూ అంతా సముద్రం అడుగున వుంటారు.''

ఓడ మెల్లిగా మునిగిపోతోందని సముద్రపు దొంగలు అప్పుడు మాత్రం గ్రహించారు. వాళ్లు యేడుస్తూ, ''బాబోయ్ రక్షించండి'' అని అరుస్తూ అటూ యిటూ పరిగెత్తారు.

కాని ఎవళ్లూ వాళ్లని రక్షించదలచుకోలేదు.

ఓడ యింకా యింకా మునిగిపోయింది. కొంచెం సేపటిలోనే దొంగలందరూ నీళ్లల్లో పడిపోయారు. అలలమీద పొర్లుతూ

''రక్షించండి! రక్షించండి! మేం మునిగిపోతున్నాం'' అని అరిచారు.

డాక్టరుగారి ఓడ దగ్గరికి బార్మలేయ్ యీదుకుంటూ వెళ్లి, తాడు పట్టు కుని, పైకి యెక్కడం మొదలుపెట్టాడు. కాని అవ్వా కోరలు బయటపెట్టి, బెదిరిస్తూ ''ర్ – ర్ – ర్'' అనేటప్పటికి బార్మలేయ్ బెదిరిపోయి, భయంతో అరిచి, తలకిందులుగా నీళ్లల్లో పడిపోయాడు.

''రక్షించండి! సాయం చెయ్యండి! నన్ను నీళ్లల్లోనుంచి బయటికి తియ్యండి'' అని అరిచాడు.





## పాత మిత్రులు

హఠత్తుగా షార్కు చేపలు సముద్రంమీద ప్రత్యక్షం అయాయి. అవి భయంకరమైన పెద్ద చేపలు. వాడి కోరలూ పెద్దగా తెరుచుకున్న నోళ్లూ వున్నాయి.

అవి సముద్రపు దొంగల్ని తరిమి, కొంచెం సేపట్లోనే వాళ్లని మింగేశాయి.

''దొంగలకి శాస్తి జరిగింది'' అన్నాడు డాక్టరుగారు. ''వీళ్లు అమాయక ప్రజల్ని దోచుకుని, వేధించి, చంపారు. వీళ్ల దుష్ట చర్యలకి తగ్గ ప్రతిఫలం ముట్టింది'' అన్నాడు.

ఓడ అల్లకల్లోలంగా వున్న సముద్రంలో చాలా సేపు ప్రయాణం చేసింది. వున్నట్టుండి యెవళ్లో అరవడం డాక్టరుగారికి వినిపించింది.

''బోయెన్! బోయెన్! బారవెన్! బవెన్!''

జంతువుల భాషలో ''డాక్టరుగారూ! డాక్టరుగారూ! ఓడని ఆపు చెయ్యండి'' అని అర్థం.

డాక్టరుగారు తెరచాపల్ని కిందికి దించాడు. ఓడ ఆగింది. చిలక కరూడా సముద్రంమీద యెగురుతూ రావడం అందరికీ కనిపించింది.

''కరూడా! నువ్వా?'' అని డాక్టరుగారు అన్నాడు. ''నిన్ను చూడ్డం యెంత సంతోషంగా వుందో! యిలారా!''

కరూడా ఓడ దగ్గరికి యెగిరి వచ్చింది. తెరచాప కొయ్యమీద ఒదిగి కూర్చుని అంది:

''చూడండి, నా వెనక యెవరు యీదుకుంటూ వస్తున్నారో! దక్షిణం వేపు ఆ అంచున చూడండి.''

డాక్టరుగారు అటు చూశాడు. మొసలి చాలా చాలా దూరంలో యీదు కుంటూ వస్తోంది. మొసలి వీపుమీద కోతి చిచీ కూర్చుంది. నవ్వుతోంది, కొబ్బరి ఆకుని వూపుతోంది.

డాక్టరుగారు వెంఠనే ఓడని అటు నడిపి, వాటికి ఒక తాటిని విసిరారు.

అవి ఓడపైకి యెక్కాయి. డాక్టరుగారి కేసి పరిగెత్తి వచ్చి ఆయన్ని ముద్దుపెట్టుకోవడం మొదలెట్టాయి. డాక్టరుగారి మూతిని, చుబుకాన్ని, చెక్కిళ్లని, కళ్లని ముద్దుపెట్టుకున్నాయి.

''సముద్రం మధ్యలో భలే తగిలారే, యెలా వచ్చారు?'' అని డాక్టరుగారు అడిగాడు.

పాత మిత్రుల్ని చూడ్డం నొప్పిడాక్టరుగారికి చాలా సంతోషంగా వుంది.

''అబ్బ డాక్టరుగారూ! మా ఆఫ్రికాలో మీరు లేకపోవడం తోటి భలే విసుగుకలిగింది. మాకు కికా లేదు, అవ్వా లేదు, బుంబా లేదు, మా బుజ్జి గుర్రుగుర్రు లేదు! మేం, బీరువాలో ఉడతలు, సోఫామీద ముళ్లపంది, బట్టల బీరువాలో చిన్న పిల్లల్ని పెట్టుకుని కుందేలు వుండే మీ యింటికి తిరిగిరావాలని యెంత అనుకున్నామో. మేం సప్త సముద్రాలూ దాటి వచ్చి యిక యెప్పటికీ మీతో స్థిరపడిపోదామని అనుకున్నాం'' అంది మొసలి.

''స్వాగతం! స్వాగతం! నాకు చాలా ఆనందంగా వుంది'' అన్నాడు డాక్టరుగారు.

''సెభాష్'' అని బుంబా అరిచింది.

''సెభాష్'' అని అన్ని జంతువులూ అరిచాయి.

అప్పుడవి అన్నీ చేతులు కలిపి తెరచాప కొయ్య చుట్టూ నాట్యం చెయ్యడం మొదలెట్టాయి.

''షితా, రీతా, తీతా, ద్రితా,
షివందదా, షివందా!
నొప్పిడాక్టరుగారినీ
యెప్పటికీ మేం వదలం!''

కోతి ఒక్కటే ఒకవార కూర్చుని దిగాలుగా ఉస్సురంటోంది.

''ఏం అలా వున్నావ్'' అని తోపుడులాగుడు అడిగింది.

''యేం లేదు! నాకు దుష్ట వర్వారా గుర్తువచ్చింది! మళ్లీ మన బతుకులు అధ్వాన్నం చేస్తుంది.''

''యేం బెంగపడకు'' అంది తోపుడులాగుడు. ''వర్వారా మన యింట్లో వుండడం లేదు. నేనామెని సముద్రంలోకి తోసేశాను. ఆమె నిర్జన ద్వీపంమీద బతుకుతోంది.''

''నిర్జన ద్వీపంమీదనా?''

''అవును.''

వర్వారా నిర్జన ద్వీపంమీద వుంటోందని తెలిసి చిచీ, మొసలీ, కరూడో సంబరపడ్డాయి.

''తోపుడులాగుడు వర్ధిల్లాలి!'' అని అవి అరిచాయి. మళ్లీ నాట్యం చెయ్యడం మొదలెట్టాయి.

''షీవందరీ, షివందరీ,
ఎందుకులెయ్ గిందుకులెయ్
మనతో లేదు వర్వారెయ్
ఆమె లేని బతుకే హాయ్!''

తోపుడులాగుడు రెండు తలలూ వూపింది, రెండు నోళ్లతోటీ చిరునవ్వు నవ్వింది.

ఓడ అన్ని తెరచాపలూ యెత్తి వుంచడంతోటి చాలా వేగంగా పోతోంది.

సాయంత్రం వేళకి ఎత్తు తెరచాప కొయ్య మీదనుంచి బాతు కికా చూసింది, తీరం కనిపించింది.

"మనం వచ్చేశాం!" అని కికా అరిచింది. "యింకో గంటలో యింటికి వెళ్ళిపోతాం! మన వూరు పిండెమోంటె కనిపిస్తోంది. కాని అదేమిటి? చూడండి, చూడండి! మంటలు మొత్తం పట్టణమంతా తగలడిపోతోంది. మన యిల్లు కూడా కాలిపోతోందేమో! యెంత భీకరంగా వుంది! యేం దురదృష్టం!"

పిండెమోంటెమీద జ్వాలల వెలుగు వాళ్ళకి కనిపించింది.

"మనం ఒడ్డుకి గబగబా పోవాలి" అని డాక్టరుగారు ఆజ్ఞాపించాడు. "మనం మంటల్ని ఆర్పెయ్యాలి! బాల్చీలు తీసుకుని నీళ్ళతోటి మంటల్ని ఆర్పేద్దాం."

కాని అంతట్లోకీ కరూడో తెరచాప కొయ్యమీదకి యెగిరింది. ఆ చిలక టెలెస్కోప్ తీసుకుని చూసి వున్నట్టుండి పగలబడి నవ్వింది. మిగతావన్నీ దాని కేసి ఆశ్చర్యంగా చూశాయి.

"మనం మంటల్ని ఆర్పక్కర్లేదు" అంది కరూడో. మళ్ళీ నవ్వడం మొదలెట్టింది. "యేమంటే అవి మంటలు కావు."

"అయితే మరేమిటవి?" అని డాక్టరుగారు అడిగాడు.

"యిది దీపకాంతి" అంది కరూడో.

"అంటే యేమిటి?" అని గుర్రుగుర్రు అడిగింది. "నేను అసలా వింత మాటే వినలేదు" అంది.

"కాస్సేపట్లో తెలుస్తుందిలే యేమిటో" అంది కరూడో. "పది నిముషాలు ఆగు, తెలుస్తుంది."



పది నిముషాల తర్వాత, ఓడ తీరం చేరేటప్పటికి, దీపకాంతి యేమిట్పైందీ వాళ్లకి తక్షణం అర్థం అయింది. ఎరుపు, ఆకుపచ్చ, పసుప్పచ్చ లాంతర్లు యిళ్లపైన, గోపురాలపైన, చెట్ల శిఖరాలపైన వెలుగుతు న్నాయి.

ఒడ్డున పెద్ద భోగి మంటలు దాదాపు ఆకాశా న్నంటుకునే జ్వాలలతో మండు తున్నాయి.

ఆడవాళ్లు, మగవాళ్లు, పిల్లలు డాబైన బట్టలు వేసు కుని సంబరంగా పాటలు పాడు కుంటూ ఆ మంటల చుట్టూతా నాట్యం చేస్తున్నారు.

నొప్పిడాక్టరుగారు ప్రయా ణంనుంచి తిరిగివస్తున్న ఓడని చూడగానే వాళ్లందరూ చప్పట్లు చరుస్తూ నొప్పిడాక్టరుగారికి స్వాగ తం చెప్పడానికి పరిగెత్తివెళ్లారు.

''నొప్పిడాక్టరుగారు వర్ధిల్లాలి!'' అన్నారు. ''నొప్పిడాక్టరుగారికి విజయీ భవ!'' అన్నారు.

నొప్పిడాక్టరుగారికి ఆశ్చర్యం కలిగింది. అలాంటి స్వాగతోత్సవాన్ని ఆయన వూహించలేదు. వస్తే యేదో తాన్యా, వాన్యలు తన కోసం వస్తారని, యింకా అయితే నావికుడు రాబిన్‌సన్ వస్తాడని అనుకున్నాడు. అలాంటిది మొత్తం వూరువూరంతా కాగడాలతో, మేళ తాళాలతో, పాటలతో తనకి స్వాగతం చెప్పడానికి వచ్చింది. యేమిటి సంగతి? తనకంత గౌరవం యేమిటి? తన రాకకి అంత సరంభం యేమిటిట!

ఆయన తోపుడులాగుడుమీద యెక్కి యింటికి వెళ్లిపోదామనుకున్నాడు. కాని ఆ జనసమూహం ఆయన్ని నేరుగా మరీనా



చౌకు దగ్గరకి తీసుకుపోయింది.

జనం కిటికీల్లోనుంచి చూస్తూ డాక్టరుగారి మీదకి పువ్వులు విసిరారు.

నొప్పిడాక్టరుగారు మందహాసం చేసి జనానికి అభివాదం చేశాడు. తాన్యా, వాన్యలు జనసమూహంలో నుంచి దారి చేసుకుంటూ తన కేసి రావడం వున్నట్టుండి ఆయనకి కనిపించింది.

వాళ్లు దగ్గరకు రాగానే ఆయన వాళ్లని కాగలించుకుని, ఓ ప్రశ్న అడిగాడు:

''బార్మలేయ్‌మీద మేం విజయం సాధించామని మీకెలా తెలిసింది?''

''మాకు పెంటా చెప్పాడు. పెంటా వూళ్లోకి వచ్చి మీరతన్ని భీకర బంది ఖానానుంచి తప్పించారని, వాళ్ల నాన్నని సముద్రపు దొంగల బారినుండి రక్షించారని చెప్పాడు.''

అప్పుడు మాత్రమే డాక్టరుగారు పెంటాని చూశాడు. అతను గుట్టకి దూరంగా నుంచున్నాడు. వాళ్ల నాన్నగారి ఎర్ర రుమాలు తీసుకుని వూపుతున్నాడు.

''యేం పెంటా బాగున్నావా!'' అని డాక్టరుగారు పలకరించాడు.

ఆ క్షణంలో నావికుడు రాబిన్‌సన్ చిరునవ్వు నవ్వుతూ వచ్చి, గట్టిగా డాక్టరు గారితో కరచాలనం చేసి, చౌకులో వున్న అందరికీ వినిపించేటంత గట్టిగా అన్నాడు:

''ప్రియమైన, మా అందరికీ ఆదరపాత్రమైన నొప్పిడాక్టరుగారూ! మా ఓడల్ని కాజేసే సముద్రపు దొంగల బారినుండి సముద్రాన్ని విముక్తం చేసినందుకు మేం అందరం మీకు యెంతగానో కృతజ్ఞులం. యిప్పటి దాకా మేం మహా సముద్రంమీద ప్రయాణం చెయ్యాలంటే భయపడేవాళ్లం, యీ దొంగలవల్ల. యిప్పుడు సముద్రానికి యీ దొంగల పీడ విరగడైంది. మా ఓడలు సురక్షితంగా వుంటాయి. యిలాంటి సాహసవంతుడైన వీరుడు మా వూళ్లో వున్నందుకు మాకు గర్వంగా వుంది. మీకోసమన్చెప్పి మేం ఓ అద్భుతమైన ఓడని నిర్మించాం. మీకు దాన్ని



కానుకగా యివ్వనివ్వండి.''

''విజయీ భవ, మా ప్రియాతి ప్రియమైన, భయమెరుగని నొప్పిడాక్టరు! కృతజ్ఞులం! కృతజ్ఞులం!'' అని జనం ముక్త కంఠంతో అరిచారు.

డాక్టరుగారు జనానికి వందనం చేసి, అన్నాడు:

''యింతటి ఆప్యాయమైన సభ జరిపినందుకు కృతజ్ఞుణ్ణి. మీరు నన్నింతగా అభిమానిస్తున్నందుకు సంతోషం. కాని, మా విశ్వాసపాత్రమైన మిత్రులు మా యీ జంతువుల సాయం లేకపోతే నేను సముద్రపు దొంగలని యెన్నటికీ ఓడించి వుండేవాణ్ణి కాను. అవి యిక్కడే, నాతోటే వున్నాయి. వాటి నిస్స్వార్థమైన స్నేహానికి నా కృతజ్ఞత తెలియజేసేందుకు వాటిని మనస్ఫూర్తిగా అభినందించాలని వుంది నాకు.''

''సెభాష్! నొప్పిడాక్టరుగారి నిర్భయమైన జంతువులకి విజయీ భవ!'' అని జనం అరిచారు.

యీ గంభీరమైన సభ తర్వాత డాక్టరుగారు తోపుడులాగుడుమీద యెక్కి, జంతువులతోబాటుగా ఇంటికి వెళ్లిపోయాడు.

కుందేళ్లు, ఉడతలు, ముళ్లపందులు, గబ్బిలాయిలు మళ్లీ డాక్టరుగార్ని చూసినందుకు చాలా సంతోషించాయి.

కాని ఆయన వాటిని పలకరించీ పలకరించక ముందే ఆకాశంలోనుంచి శబ్దం వచ్చింది. డాక్టరుగారు గుమ్మం దగ్గరికి పరిగెత్తివెళ్లాడు. కొంగలు ఆయన వేపే యెగురుతూ వస్తున్నాయి. అవి డాక్టరుగారింటికి యెగురుతూ వచ్చి, యేం మాట్లాడకుండా బుట్ట నిండా బుట్టెడు పళ్లు తెచ్చాయి: ఖర్జూరం పళ్లు, ఆపిల్ పళ్లు, భేరీ పళ్లు, అరటి పళ్లు, పీచ్ పళ్లు, ద్రాక్షలు, నారింజలు.

''యిది మర్కట రాజ్యంనుంచి మీ కోసం, డాక్టరుగారూ!''

డాక్టరుగారు వాటికి కృతజ్ఞతలు చెప్పాడు. అవి వెంటనే మళ్లీ వెనక్కి యెగిరివెళ్లిపోయాయి.

ఓ గంట తర్వాత డాక్టరుగారి తోటలో పెద్ద విందు జరిగింది. రంగు

రంగుల లాంతర్లు వెలుగుతూ వుంటె పొడుగాటి బల్లు, పొడుగాటి బెంచిలు వేశారు. వాటిమీద డాక్టరుగారి స్నేహితులందరూ కూర్చున్నారు: తాన్యా, వాస్య, పెంటా, ముసలి నావికుడు రాబిన్‌సన్, స్వాలో పిట్ట, గుర్రుగుర్రు, చిచీ, కికా, కరూడా, బుంబా, తోపుడులాగుడు, అవ్వా, ఉడతలు, కుందేళ్లు, ముళ్లపందులు, గబ్బిలాయిలు.

డాక్టరుగారు వాటికి తేనె, పళ్లరసాలు, తేనె పట్లు, మర్కట రాజ్యంనుంచి వచ్చిన అద్భుతమైన పళ్లు పెట్టాడు.

విందు దిగ్విజయంగా జరిగింది. వచ్చిన వాళ్లందరూ సరదాగా సల్లాపాలాడు కుంటూ నవ్వుకున్నారు. హుషారైన పాటలు పాడుకున్నారు. ఆ తర్వాత తోటలో, రంగురంగుల దీపకాంతిలో నాట్యం మొదలైంది.

డాక్టరుగారు నవ్వులేకుండా ముదుచుకుని, గబగబా యింట్లోకి వెళ్లడం వున్నట్టుండి పెంటా గమనించాడు.

''యేం జరిగింది?'' అని పెంటా అడిగాడు.

డాక్టరుగారు యేం మాట్లాడకుండా, పెంటాని తీసుకుని, మెట్లెక్కి పైకి వెళ్లాడు. హాలు గుమ్మం దగ్గర, తలుపు పక్కన జబ్బుగా వున్న జంతువులున్నాయి. పిచ్చి తోడేలు కరిచిన ఎలుగుబంటి, దుష్టులైన పిల్లలు గాయపరచిన సముద్రపు పక్షి, ఒక లేడి పిల్ల. అది అంత సేపూ మూలుగుతూనే వుంది. దానికి దద్దుర్ల జ్వరం. దాన్ని ఆ గుర్రం తీసుకువచ్చింది. గుర్తుందా, కిందటేడు డాక్టరుగారు అద్భుతమైన కళ్లద్దాలు యిచ్చారే ఆ గుర్రం.

''యీ జంతువుల్ని చూడు. నీకర్థం అవుతుంది నేనా విందుని తొందరగా యెందుకు వదిలివచ్చానో. నా ప్రియమైన జంతువులు ముక్కుతూ మూలుగుతూ వుంటే నేను ఉత్సాహంగా యెలా వుండగలను?''

డాక్టరుగారు గబగబా తన పఠన మందిరంలోకి వెళ్లి సరాసరి మందు తయారు చెయ్యడం మొదలెట్టాడు.

''నేను మీకు సాయం చేస్తాను'' అన్నాడు పెంటూ.

''తప్పకుండా అలాగే'' అన్నాడు డాక్టరుగారు. ''ఎలుగుబంటి టెంపరేచర్ తీసుకో. లేడి పిల్లని యిక్కడికి తీసుకురా. దానికి చాలా జబ్బుగా వుంది. దాదాపు చచ్చిపోతూ వుంది. మిగతా వాటికంటే ముందు దానికి నయం చెయ్యాలి.''

పెంటూ మంచి అసిస్టెంటని పించుకున్నాడు. ఒక గంట లోపలే డాక్టరు గారు అన్ని జంతువులకీ నయం చేశాడు. బాగయిన వెంటనే అవి సంతోషంతో నవ్వి ''చాకా'' అని చెప్పి డాక్టరుగారిని ముద్దుపెట్టుకున్నాయి.

డాక్టరుగారు వాటిని తోటలోకి తీసుకువచ్చి తన మిత్రులకి వాటిని పరిచయం చేసి, ''దారి యివ్వండి'' అని అరిచాడు. కోతి చిచీతో కలిసి ''త్కెల్లా'' నాట్యం చెయ్యడం మొదలెట్టాడు. ఆయన యెంత కులాసాగా, బాగా నాట్యం చేశాడంటే, ఎలుగుబంటి కాని, గుర్రం కాని ఒట్టినే కూచోలేకపోయాయి. ఆయనతో కలిసి నాట్యం చేశాయి.

ఆ రకంగా జాలిగుండె డాక్టరుగారి సాహస కృత్యాలు ముగిశాయి. ఆయన సముద్రం దగ్గర స్థిరపడి జంతువులకే కాక, తమ పిల్లలతో ఒడ్డుకి యీదుకు వచ్చే డాల్ఫిన్స్‌కి, చేపలకి, సముద్రపు పీతలకి వైద్యం చెయ్యడం మొదలు పెట్టాడు.

విషయ

## ఒకటవ భాగం

# మర్కట రాజ్యానికి యాత్ర

సూచిక

## రెండవ భాగం

# పెంటా, సముద్రపు దొంగలు

